సంగీత

# సుజ్ఞానోదయము

( అను )

# తారాశశాంక విజయనాటకము.

పూర్వకవి

శేషము వేంకటపతిచే వ్రాయబడిన

ప్రబంధమునందలి పద్యములతో

నాటకరూపకముగా

రచియింపబడియె.

మచిలీపట్టణము

సేతు ముద్రాక్షరశాలయందు

సి. సేతు మాధవరావుచే

ముద్రింపబడి

నందూరి రామలింగయ్యచే ప్రచురింపబడియె.

1910.

 వెల 8 అణాలు. 

# పీఠిక

భాషాభిమానులారా:

ఈగ్రంథమునకు పీఠికవ్రాయుట యనవసరమైనను యాచారమును విడుచుటధర్మముగాదనియెంచి, రెండుమూడుమాటలతోనే, నేను ప్రకటించినాటకపాత్రలచేతనే, నేనేయభిప్రాయముతో యీగ్రంథమునిట్లుమార్చినదియు, చెప్పించెదను. ప్రబంధములను జదువుటకు మనవారు, ప్రస్తుతకాలమందలవాటు పడకయుండుటవలన, కేవల పద్యములతోనే కూడియుండు, ప్రబంధములను మధ్యమధ్య వచనభాగములనుజేర్చికథను, కవిత్వమును, విసుగులేకుండజదువునట్లు, జేయుట మంచిదనినేనెంచి, దీనిని నాటకముగాయిట్లుమార్చితిని. ఆడదలచిన వారికిమధ్యమధ్య పాడుకొనుటకు కొన్నిపదములనుగూడ చివరజేర్చితిని. అందుగూడ నాకష్ట మావంతయునులేదు. బాల్యచాపల్యముచే చేసిన యీవంటకముయొక్కరుచి భోక్తలవలన వినినపిదప యింకను, "బిల్హణీయము, ప్రభావతిప్రద్యుమ్నము, రంగరాయచరిత్ర," మున్నగున్నవి నాటకములుగా మార్చెదను. నాచేతయందుండు లోపములను పాటింపక, గుణములను మాత్రమే పాటింతురుగాక, యనిచదువరులనుప్రార్థించుచున్నాను.

గ్రంథకర్త.



తారాచంద్రులు.



# సుజ్ఞానోదయము.



నాంది

శా॥ శ్రీ విన్నాణపు గుబ్బచన్నులనయా రేగంబు రాగుష్పి ము
క్తాసల్లుల్ ఘటియించెదేమి శశికిఁ దారాప్రియుక్తంబనే
భావంబోయని పల్కు కల్కి చెలిసంభావించు కాశీపురీ
దేవుండీవుత యీసభాసదులకుఁ దీర్ఘాయురారోగ్యముల్ ॥

(నాంద్యంతరమున సూత్రధారుడు)

అతి విస్తర మేల? ఆహా! ప్రజల మాఢ్యము! నిజానిజములు గుర్తెరుంగక విద్యావిహీనులుగను, యందువలన జ్ఞానహీనులుగను, యుండెడి యంధులయి యున్నారు. జ్ఞాననేత్రము లేనికారణమున వీరు మన పూర్వకవుల ప్రబంధరాజముల యందలి నిజమైన యర్థమును గ్రహించలేక పోయిరనుట నిర్వివాదాంశము. అయినను తలపెట్టిన

పని మాననేల? సభాసదుల యాజ్ఞ చొప్పున నాటకారంభముం గావింప మత్ప్రియసఖి సహాయమును గోరెద- (తెరవంక జూచి) ఓసీ! నీసింగారము తరువాత చేసికొనవచ్చు నొకసారి యిటురమ్ము.

నటి— (ప్రవేశించి నమస్కరించి) నాథా! నన్నుబిలుచుటకు కారణం బేమి?

సూత్ర— పనికిమాలినదానా! ఈ రోజున నాటక ప్రయత్నము మరచి పోతివా యేమి?

నటి— లేదు. లేదు. ఆడవలసిన నాటకమేదో చెప్పలేదు గద. నేజేయు ప్రయత్నమంతయు ముగిసినది. పాత్రలవిషయము మాత్రమున్న సిష్టము.

సూత్ర— జ్ఞానబోధప్రధానముగు తారాశశాంక విజయ కథ ననుసరించి కొద్దిమార్పులతో వ్రాయబడిన "సుజ్ఞానోదయ" మను నాటకమే నేటిదినము ప్రదర్శింపుమని గదా సభాసదుల యాజ్ఞ.

నటి— (ఆశ్చర్యముతో) తారాశశాంక విజయము శృంగార రసప్రధానము గాని, జ్ఞానబోధప్రధానమెట్లగును? పొరపాటుంబడి యుంటిరో యేమి?

సూత్ర— (నవ్వి) అవును. అంధుల మైన మనకు మనపూర్వుల యూహాల పరికించు తెలివితేట లెక్కడినుండి వచ్చును?

నటి— ఏమి? అట్లంటిరి?

సూత్ర— సుబోధక మగునట్లును ప్రతివారును చదువుటకు విసుగు లేకుం

డుటకును క్లిష్టముగా కనుపించు జ్ఞానవిషయమైన, యీగాధను శృం
గారరస భూయిష్టమైన యొకకధగా కవి దీనిని కల్పించినాడు;
గాని వేదాంతార్థము దీనికి వేరుగా గలదు సుమీ!

నటి— అట్టి వేదాంతమువలన కలుగు లాభముకన్న నీతిబాహ్యమగు నీ
కధ కల్పించుట వలన చెడుగెక్కుడగు నేమో?

సూత్ర— అది కేవలము పొరపాటు. గులాబి చెట్టునకు ముండ్లు కలవని
పుష్పములు కోయుట మానితిమా? తారాశశాంకవిజయమునందు
నీతిబాహ్యమయిన పదప్రయోగము కలదని యందలి నిజమునూ
విడువ వచ్చునా? అదిగాక యందు దుర్నీతిగలదని యనుకొనుటం
గూడ మిక్కిలి పొరపాటనియే నాయభిప్రాయము. మన పూర్వులు
వారనుకొను కొన్ని కారణముల ననుసరించి కొన్ని కట్టుబాట్లను,
ఆచారములను, పురాణగాధలను, త్రిక్షితిత్రిక్షి నస్పుటకవిలు
లేనట్లు యున్నసంగతిని, వేరొకవిధముగా మరుగుపరచి చెప్పిరి-
అట్లు చెప్పుటలో వారికిగల సదభిప్రాయముగాని, చెప్పుటకుగల
కారణములు గాని, మనకు తెలియక పోవచ్చును.

నటి— ప్రస్తుతము కధయందలి వేదాంతార్థ మేమయియుండును?

సూత్ర—అది చెప్పెదవినుము. బృహస్పతియనగా శాస్త్రజ్ఞానము. చంద్రుం
డనగా యనుభవ జ్ఞానము. తారయే మనస్సు. శాస్త్రజ్ఞానమునూ
బృహస్పతి మనస్సనెడి తారను పెండ్లియాడెను. శాస్త్రజ్ఞా
నమునకు, కుమార శిష్య తుల్యుండగు చంద్రుడు, తారకుయింపొం
నర్చెను. నిజముగా యనుభవజ్ఞానమేకదా మనస్సున కానందము
గొల్పునది. అట్టి యనుభవ జ్ఞానంబునకే యనగా చంద్రునకే జ్యోతి

ప్రకాశింప జేసి యుంటచే, పూర్వకవులవంటి యింపులనింపు కవిత్వము నీకాలమున రచించుట దుర్లభము. అదిగాక నాటకాకాశలను మన ప్రస్తుత నాటక కర్తకు బహుస్వల్పము. అందులోయిది ప్రథమము. అదిగాక శేషము వేంకటపతి కన్న యెక్కుడురసవంతమైన వృత్తములను తాను చేయ నసమర్థుండని యెరిగియే యందులకు ప్రయత్నించలేదు.

నటి— కాని—

సూత్రి— ఓసి! కాలవిలంబన మగుచున్నదిసుమీ! మరచి మనము వేదాంత గోష్టిని బోవుచుంటిమి. త్వరలోపోయి పాత్రల సిద్ధపరుపవలయును.

నటి— చిత్తము. కాని జ్ఞానకథను బోధించిన యీరంగమును శృంగార రంగముగా మార్చుటకు ముందు యవశ్యాచారమగు ఋతువర్ణనము చేయకపోవుట యనుచితముగాదా?

సూత్ర— ఉచితానుచితములు విచారించుట స్త్రీలకు తెలియునా! నీపాట వినుపించవలెనని నీయుడాహలుడి! సుధాకర పాత్రగా నేనుండి ముందు కథాసందర్భమున నీవు చేయవలసిన ఋతువర్ణనను నేను చేసెదనులే. ఋతువర్ణనయందు నీకు గలప్రజ్ఞనే నేనుగురుస్థానముగా నెంచి నీ యొద్ద పాఠములు నేర్చుకొనెదనులే.

(నిష్క్రమణ)

ఇదిప్రస్తావన



# సుజ్ఞానోదయము.

## ప్రథమాంకము.

---

### 1. రంగము బృహస్పతి గృహమునందలిచావడి.

(బృహస్పతి పాఠములుచెప్పుచు, చంద్రుడు, జయంతుడు ప్రవేశము)

బృహ— జయంతా! వల్లెవేయుము చూచెనవేమి!

జయం— యయావంవేదా- వేదా- వేఏఏదా- యయావం- దావే! దావే!

బృహ— ఆఁ! ఆఁ! అదేమిటోయి యట్లు మొదలు పెట్టితివి.

జయం— జట, ఘన చెప్పుచున్నానండి.

చంద్రు— (నవ్వుచున్నాఁడు)

బృహ— సుధాకరా! నీవెప్పుడైన యిట్లు వేదమునభ్యసించితివా? వీడుపరమ శుంఠవలె గనబడుచున్నాడు. ఇంతశుద్ధమొద్దులకు చదువు చెప్పుట యెట్లు?

జయం— మీగురువుగారు మీకు చెప్పినట్లే!

చంద్రుడు— (పకాలున నవ్వుచున్నాడు)

బృహ— ఓరీమూర్ఖా! నేనునీవలెయిట్లు మొద్దుగనుంటిననియా నీయభిప్రాయము.

జయం— ఇప్పుడుంటిరని కాదు. మావలె మీరుశిష్యులుగా నున్నప్పుడు.

బృహ— గురుదూషణ మొదలు పెట్టిన వీనికి చదువెట్లు వచ్చును?

(తెరలో)

సుధాకరు నొకసారిలోపలికి బంపుడు. పెరటిలో దూడపరుగులెత్తుచున్నది.

చంద్రుడు— (లోపలికి బోవును)

బృహ— జయంతా! నీకింత గురునిర్లక్ష్యము కూడదుసుమా! సుధాకరు డెంతలోపాఠములను నప్పచెప్పనో చూచితివా! నీవలెవాడుయెల్లప్పుడును వల్లెవేయడుచూడు! వానికివిద్యసంపూర్ణముగ వచ్చినది. నీకింతశ్లేషార్థముగా మాట్లాడుట తప్పమరేమియు రాదు.

జయం— నేను—

బృహ— చెప్పిన దంతయు వినుము. మేము నీవలె శిష్యులుగానున్నప్పుడు గురుదూషణ చేయుచు, పాఠములు చదువకయుండెడి వారము కాము.

జయం— నేను మిమ్మును దూషించితినా?

చంద్రు— (ప్రవేశించును)

బృహ— గూడను కట్టివచ్చితివా?

చంద్రు— చిత్తము. కట్టివచ్చితిని.

బృహ— జయంతా! నీవు పాఠములను జాగ్రత్తగా వల్లెవేయుచుండుము. మేమగ్నిహోత్రములజేయ బోయెదము.

(అందరు నిష్క్రమించుచున్నారు)

## 2 రంగము: ఉద్యానవనము.

( ప్రవేశము. నవమాలిక పద్మావతి యను యిద్దరుచెలికత్తెలు.)

నవ— నిజమే! చంద్రుడు విద్యలయందేగాదు. రూపమునందు మాత్రము సామాన్యుడా!

ఉ॥ చక్కనిపోలికబోని నగజాలు గళంబును గేలనొక్కినన్
జిక్కనిపాలుగారు నునుఁజెక్కులు సంపెఁగమొగ్గ యందమున్
ద్రొక్కెడు చారునాసికయు తోరపుడాల్వాలి దమ్మి రేకులన్
మిక్కిలిగెల్చుకన్నులును మించునొయారములింపునించగన్ ॥

మరియు

క. పరువంపుప్రాయముననా
సరసుని నెన్నడుము మిగుల సన్నంబయ్యెన్

మరునిమఱుఁగెసఁగ నిచ్చలు
తరుణులుజూడంగ దృష్టితాఁకినరీతిన్ ॥

పద్మ— చెలీ! నీవుచెప్పిన దెంతయు నిజము. వానికెంతసీటు వచ్చిన దనుకొన్నావు!

సీ॥ పలుమారు ముగ్ధభాషలు పల్కుటలుమాని
యపరిజాణతనంబు • లాడఁదొడఁగె
సతతంబు వేదశా • స్త్ర ప్రసంగముమాని
శయ్యలోకొక్కోకసారి • చదువసాగె
సహజంబుగా వధూ • జనుల జూచుటమాని
సొలపున నోరగా • జూడఁగలిగె॥
వేడ్కబాలురతోడ • విహరించుటలు మాని
సరసులతో జెల్మి • సలుపఁ బూనె

పటువు జిగిమోవి మెరయ న • వ్వుటలెరింగె
వింతవింతగ గైఁసేయు • విధముఁదెలిసె
మొలకమీసలువడిగొల్పు • మురువునేర్చె
రసికతానంద శృంగార • రసమునేర్చె॥

వస— ఓసి నీవెర్రిగాల! సహజసౌందర్యముగల పురుషులు సీటు తెచ్చి పెట్టుకొనవలెనా? అదియునుంగాక

ఉ· హాటకగర్భవంశన మృతాంశుడు సుజ్జ్వలమూర్తియౌ జగ
న్నాటకసూత్రధారకు మనం బలరంగమెలంగినట్టి య
ష్మేటికళా నిధిత్వమున మించినవాడెలజవ్వనంబు స
య్యాటలు మీరుచోఁగుపలయాత్ములకిం పొనరించు టబ్రమే॥

పద్మా— అటులచెప్పుము. (రహస్యముగా) నేనొకమాట చెప్పెదనుగాని యిదిపరమగోప్యముగా నుంచవలయునుసుమీ. చంద్రుడునుతార—

నవ— ఆఁ! నీవు చెప్పఁబోవున దేదియో నాకు దెలియును.. ఈవిషయములో నీకీయాశ్చర్యమేల?అదియంతయు మన్మథ విలాసముసుమా! కానియెడల వేల్పుటొజ్జభార్యయగు తారయేడ? యిట్టి దుశ్చింతయేడ? నిజముగా యామె చంద్రునియందు మనసు తగిలి యున్నది.అదనాకు బాగా తెలియును. దీనికినావద్ద రహస్యమేల?

సీ॥ జిలుఁగువల్వవదల్చి ♦ చెంగావిధరియించి
యదిబాగొయిదిబాగొ♦యనుచునడుగు
రైకసడల్చియా ♦ రజపుఁబైట ఘటించి
యదిమేలొ యిదిమేలొ ♦ యనుచునడుగు
జడవిచ్చివింతగా ♦ జారుకొప్పమరించి
యదినీటొ యిదెనీటొ ♦ యనుచునడుగు
హెచ్చుముక్కరదీసి ♦ పచ్చతళ్కుధరించి
యదిలెస్సయిదిలెస్స ♦యనుచునడుగు

కమ్మకస్తురితిలకమ్ము ♦ జిమ్మిసమ్మ
దమ్ముగ్రమ్మఁగ జిగికుంద ♦ నమ్ముదళకు
తిలకమలికమ్ము ననుజిగి ♦ దొలఁకబూని
యంవొయిందునొ యందమం ♦ చడుగువాని॥

నవ —ఇదిమాత్రమెగాదు, ఒక్కొక్కప్పుడు

కం॥ అద్దముగానము తిలకము
దిద్దరసుదుట నన, సతేడుదిద్దుచునుండక్

ముద్దిడ వ్వాతెరయొగ్గును
ముద్దియ యతఁడూరకున్న మోడిగఁజూచుక్ ॥

పద్మ—అవును.

నవ— మరియొకటి.

ఉ॥ ఒక్కొకవేళ నాసరసుఁడొంటిగనింటను నిద్రవోవఁగా
నక్కలకంతి తన్మరసమంటగ నెంటని ప్రేమవాని ను
న్నెక్కులు ముద్దువెట్టుకొను

పద్మ—ఇంతతో యూరకుండునా!

నిద్దురలేచినయంత నింతనే
పెక్కడబోయితీగురుతుఁ లేడవి యద్దముఁజూచికొమ్మనుక్ ॥

నవ— చంద్రునికి మాత్రమామెపై వలపులేదందువా?

పద్మ—అబ్బో! చంద్రుడుమాత్రము లేనట్లుకనబడునా? తానునుయర్ధాంగీకార భావముతో నుండును. ఎరిగీయెరుగనట్లాతడు నటించు నేగాని, యతడు మాత్రముసామాన్యుడా! సకలము నేర్చిన చతురుడుగాడా!

నవ— కానిమనము మనసఖియందు ప్రధానిందమోపుచుంటి మేమోయని నాకు సందేహముగానున్నది.

పద్మ—ప్రధానిందమోపుట కేమున్నదే? మనసందేహము నిజమయినను. యిందుతారను నిందించవలసిన పనిలేదు.

నవ— ఏమి యట్లనుచుంటివి. స్త్రీలకు పాతివ్రత్యమేగదా భూషణము.

పద్మ— అదిచెప్పుట సులభమేగాని యాచరించుట కష్టసాధ్యముగద!

ఏమంటివేని స్త్రీకితగిన యౌవన పురుషునిజూచి వివాహముచేయక యే చివుకుబండనో, యే ముసలిమొద్దునో, కట్టిపెట్టి పాతివ్రత్యమున నుండుమనిచెప్పుటకును, పురుషులకు వారికంటె యౌవనస్త్రీని పెండ్లాడినను, యేకపత్నీవ్రతస్థులుగా నుండవలెనను ప్రతిబంధకము కలుగజేయకపోవుటచేతను నీతిశాస్త్రకారునిబుద్ధి జడత్వమునే చూపునుగాని ప్రపంచకమున స్త్రీలీ నియమమును వాడుకయందుంచుట బహు కష్టసాధ్యము.

నవ— పురుషు డేకపత్నీ వ్రతస్థుడుగా నుండవలెనని ప్రతిబంధకము లేదని ధర్మములను నిందించుచున్నావు. నీతిశాస్త్రములయం దా నియమము లేదనియా నీయూహ?

పద్మా— కాదుకాదు. నీతిశాస్త్రమందుండ కేమి ? ఉండినలాభ మేమి ? పురుషులట్లు నడచుచున్నారా?

నవ— పురుషులు నడచుటలేదుగావున స్త్రీలుగూడ దురాచారపరులయి యుండవలెననియా నీ యభిప్రాయము.

పద్మా—ఇంతగానున్నవి నీ తెలివితేటలు ! నీతిశాస్త్రమందుండిన యుండు గాక ! నీతిశాస్త్రకారులయినపురుషులే తమనీతులకువ్యతిరేకముగా నడచినచో యబలలును విద్యావిహీనులును యగు స్త్రీ లట్లుండుట కష్టసాధ్యమని నావాదన.

నవ—నాగరికతయు విద్యయు హెచ్చినకొలది దుర్భాగ్యము హెచ్చిపరలోక చింత తగ్గునే. ఇప్పుడీ నీతిశాస్త్రముల తర్కమునకేమిగాని చంద్రుడు బహు చక్కనివాడుసుమా!

పద్మా— (నవ్వుచు) ఏమే! నీతియంతయు నీట గలుపుచుంటివి.

నవ— నన్నెగత్కాళి జేయుదువుగాని నీవుమాత్రముచంద్రుడుచక్కనివాడని చెప్పవాయేమి? అనిగాక యాతనిచక్కనివాడని చెప్పకొనుటలో దోషమేమిగలదే?

పద్మా— దోషములపరకు యెందుకుగాని యీదినము తారను గలిసికొని యామె యుదంతము తెలుసుకొనవలయునే.

నవ— చాలు! చాలు! ఆమె వచ్చుచున్నట్లున్నది. ఇట్టిపిచ్చిమాటలామెకడ తేగలవు. పోవుదము రమ్ము,

(ఇద్దరు నిష్క్రమింతురు.)

## 3 వ రంగము.

(తారపువ్వుల పల్లెముతో ప్రవేశము.)

తార—(పళ్ళెమునుక్రిందపారవైచి చతికిలబడి తనలో)నిన్నుతలచుకొని ప్రార్థించుటనిశ్చయముగయగ్నిపయి నేయిబోయుటసుమా! ఓరీ! మదనా! ఇంతులపయినా నీపంతము. పతిచెంతనున్నను నీపంతమేసాగుట నా దురదృష్టమే. అయ్యో! నిన్ను నిందించిన లాభమేమి? నీపనినీవుమానుదువా? కింకరసమానులగు నోతలిదండ్రులారా! నేనుసుఖపడుదుననియే నన్నీముసలిదేవతకు కట్టబెట్టితిరా? త్రిలోకాధినాథునకు గురువయిన బృహస్పతిభార్య నగుదుననియు, సొమ్ములుధరింతుననియు బంగారమేభక్షింతుననియు, యోచించితిరేగాని, నాయౌవనముమాట నేయేట్రదోసితిరి. యౌవనవంతురాలగు స్త్రీకి నీటుగాడగు పురుషునియందే మనస్సునిలిచియుండునుగాని, ధనవంతుడైనను, బ్రహ్మదేవునిదలదన్నినవాడైనను, ముదుసలినికోరదు. యౌవనపురుషుని సన్నిధినిగదా ధనము, నగలు, కావలెననికోరుట. అన్నముండినగదా యాధారము

లుకావలెను. ఛీ! దురాశాపరులగు మీతో నేల? మూఢదైవమా! నన్నా డుదానిగా నేల సృజించితివి? సృజించితివి పో, నన్ను బాల్యమునందే చంపుకొనిపోక యౌవనవంతురాలనుగా నేల జేసితివి! చేసితివయ్యా! నన్నీ ముదుసలి రక్కసికా బలియిచ్చుట? పోనిమ్ము! ఏ ముదుసలియో! శీలముగల స్త్రీలకు యిహ పర సౌఖ్యములు కలుగునని యొరగవేసుకొని జీవించుదమన్న యీ మగడు—ఛీ! ఏడు నాకు మగడా! యమబాధపడవలయునుగద, జనపనారపీచువలె గడ్డము గ్రుచ్చుకొనుటయే గాని, మనసార ముద్దుపెట్టుకొనుటకు వీలైన లేదుగద. ముఖమంతయు వెండ్రికలే! ఛీ! అట్టివానియందు వెలయాలివలె లేని మోహమును గనబరుచుచుండవలె. కానిమ్ము భగవంతుని దూషింపనేల? ఆతని యనుగ్రహమువల్ల నేగద యీచంద్రుడు నాయింట మెలగుట. సౌందర్యముగల పురుషునొకనిని జూచుచునయిన సంతోష పడుచుంటిని. ఈతడు మద్భర్తకు శిష్యుడుగా నేల రావలయును? అయ్యో! ఏమి నా వెర్రి. శిష్యుడుగా గాయెనిడల యిచటకు వచ్చుటకుగాని, నా యాటలు సాగుటకుగాని వీలే లేదుగద. కానిమ్ము సుధాకరా! చంద్రా! శశాంకా! నీనామోచ్చారణము చేసికొనియు, నీరూపము జూచికొనియుగదా, నేజీవించుచుంటిని. బాల్యమునుండియు గంపెడాసతో నీకు సేవజేయుచుంటిని. ఆఁ ఏమంటిని! గంపెడాసతోనా? ఛీ! నా హృదయమెంత కలుషపూరిత మయినది? నాజన్మము కాల్పనే! చంద్రుని పుత్ర వాత్సల్యతతో పోషించియాతని రూపు జూచి భ్రమ జెందుచుంటిని.

(తెరలో)

తత్స బ్రహ్మార్పణమస్తు.

ఉలికిపడి తనలో) జపము ముగిసినట్లున్నది.

(తెరలో)

ఓయీ! జయంతా! గురువుగా రగ్నిహోత్రములను ప్రారం భించు చున్నారు. నీవు యాద్యమును గొనిరమ్ము.

తార— (తనలో) సరే! జయంతుఁడాద్యమును తీసికొని పోవును. (అని యోచించి) పయిగా యీతడు నాభర్తకు శిష్యుడు. ఇది బయల్ప డిన లోకములో తలయెత్తుటకు నాకు వీలు లేక పోవుట యటుండ భర్త నపకీర్తిపాలు సేయవలసి వచ్చును. ఇహపరములకుఁ జెడ వలెను. అయ్యో! వెఱ్ఱిదాన! తార! నీకేమి పిచ్చిపట్టినదాయేమి? చంద్రుడు నిన్నంగీకరించి నప్పుడుగదా యీరాద్ధాంతము. అంత యదృష్ట మీదీనురాలికి గలుగునా? అయినను మనుష్యప్రయత్నము మానరాదు. అబ్బే! స్త్రీనగు నేను ప్రయత్నించుటయా? పైగా నేను ప్రయత్నించుచు నే యున్నాను. నాయాట లా సాగ సు కాదు — ఆ—నాయారవప్రాణము —కాదు నాప్రాణ మే. ఊఁ-పట్టివొంగ-చంద్రుని-వద్దసాగునా? ఆ! సాగ కేమి? ఏమో? సాగినను సాగకపోయినను ప్రయత్నము మానను. అగ్నిహోత్ర శాల యందుండును. ఒకసారి చంద్రుని మొగముజూచివచ్చెదను. నే లేకుం డ యేలయగ్నిహోత్రములు చేసితిరని, భర్తపై యలిగెదను. చంద్రుని కోపము బాప నావద్దకు బంపును. అప్పుడు సాయాసదీర వాని చెవియందేకాంతముఁ జెప్పుదానివలె చెక్కులపై నాముఖమునాని తనివి పొందెదను. ఆహా! వానియంద మేయందము. వానిచెక్కులు మాది పింజల వలె మెత్తగానుండి నిగనిగలాడుచుండును. అభాగ్య శాలి! నాకన్నుల పంట! నాజీవితాధారము! నాచంద్రునిచూచి సంతోషించుటకు (తెరలో జేగంటవినబడుచున్నది) పోయెదను.

(తార నిష్క్రమించుచున్నది.)

# సుజ్ఞానోదయము.

## ద్వితీయాంకము.



### 1 రంగము—ఉద్యాన వనము.

———:o:———

పుష్పకుటీరము.



( చంద్రకాంత వేదికపై చంద్రుడు ప్రవేశించుచున్నాడు)

చంద్రు— (పుస్తకమును క్రింద బారవైచి తనలో) ఔనదినిజమే. కాకున్న యీశ్లేషార్థములు, యీవగలాడి తనము, చిరునగవు హావ భావ విలాసములు, వూరక గన్పడవు. ఒకవేళ చనువుచేత పుత్రి సమానునిగానెంచి చేయుచున్నదేమో? కాదు. అట్లయినచో యెవ రయిన వచ్చిన మానుటయేల జరుగును? సిగ్గుచేతనా! అవును. కొందరు స్త్రీలు చనువుగలవారియొద్ద యనేకకార్యములు యనుమా నాస్పదములయినవే-దురుద్దేశ్యము లేకుండ జేయువారు గలరు. అది వట్టి యమాయికత్వముచేఁ గలుగును. పోనిమ్ము యీమెది దురు ద్దేశ్యమే! ఆఁ! దురుద్దేశ్యమా? నాపట్ల దురుద్దేశ్యము కాదు. నన్ను పెద్దవానిని జేయుటకే. నాకుప్రియము చేయనే—చేసిన

దనుకొందము. ఏమంటివి? అయ్యో! నాకీ యంతరాత్మ లేక పోయినను సుఖపడువాడను గద. గురుద్రోహి సుధాకరుండని నాకు పేరురానున్నది కాబోలు. దీపమును పండని భ్రమసి దానిపైబడి మ్రగ్గు శలభంబుకైవడి గురుభార్యావిషయమై నాకీద్రోహచింత కలుగదు. (ఆలోచించి) నా సహపాటి యింద్రుడులేడా? దీని కేమిగాని నేజదివిన శృంగార ప్రబంధములయందలియు, నాటకములయందలియు, యందందు వర్ణింపబడిన సుందరీమణుల నెరజాణతనంపు లక్షణములీమెయందు గానవచ్చుచున్నవి. బలె! జన్మమన బృహస్పతి— అబ్బె— పిల్లికి రొయ్యల మొలత్రాడువలె—కోతికి కొబ్బరికాయవలె — వాడు సంతస పడునేమోగాని వానికేమి దెలియును సరసము! ఆరే! పాపాత్మ! చంద్ర! గురుదూషణ నిన్నిహపరదూరుని జేయును. పైగా గురుభార్యను జేపట్ట నుంకించుచున్ననీ పాట్లేమగునో! అరే! పాతకమనియైన యోచింపవా? అయిననేమి? పాపమో గీపమో.

కం॥ యీవనిత బెళుకు చూపులు
భావజు తూపుల వితాన • పైఁ బర్వినచో
నేవేదము లేశాస్త్రము
లేవాదము లేవివేక • మేలా నిల్చున్ ॥

మరియును

చ॥ మెలకువ సజ్జగాంచి తమి మించి నయంబున బుజ్జగించి పై
పుల నెలయించి వింతసొలపుం దెలుపుం బలువున్ వగల్ దగన్
గళల గలంచి భావములు గాంచి రతిం దనియించి వేడ్క నీ
యలికులవేణి గూడవలదా యిలఁ బాఁపను వెత్తినందుకున్ ॥

చ॥ తలపగ సాహసంబు తలిఁదండ్రులు విన్నను తారకీగురుం
డలిగిన మోసమింద్రుఁ ప్రాపయంబునకుం వెలియౌదునందుపై
పొలతుల నవ్వుగూడ చెటుబోయెటు లౌనో యిదేల తానె యీ .
చిలుకల కొల్కి బల్కి దయచేసిన చూత్రమ చెట్లు వచ్చునో॥

అయినను తొందరపడి శాశ్వత స్వచ్ఛ కీర్తిని నలుపు చేసి కొన రాదు గద.

(తెరలో)

సుధాకరా. గురువుగారి యాజ్ఞ యైనది.

(పుస్తకమును తీసుకొని నిష్క్రమించును.)

---

## ద్వితీయాంకము.

### 2. రంగము బృహస్పతి గృహమునందలి వేదాధ్యయన మండపము.

(ప్రవేశము బృహస్పతి, చంద్రుడు, జయంతుడు, కొంచెముదూరముగా తలుపుచాటున రవిక కుట్టుకొనుచు తార),

బృహ— నాయనా! తారామనోహరా! సద్బుద్ధులు గరపినప్పుడవి గ్రహించుసూక్ష్మబుద్ధిగలశిష్యులయందుగురువులకు వాత్సల్యముండుట సహజము. నీవు మిక్కిలి కుశాగ్ర బుద్ధివి. నిన్ను పొగడుచుంటి నను కొనెదవేమో? అట్లుకాదు. యోగ్యునకు వివాహముచేసిన కన్య సుఖియైసంతానవంతురాలగునట్లు నీ వంటివానికి చెప్పిన విద్యసద్వినియోగమౌటయే గాక గురువులకు కీర్తి దెచ్చును.

చంద్రు— ఇదియంతయు తమ యనుగ్రహాఫలితమే గదా.

తార— (చంద్రునిపై చూడ్కులు నిల్పుచు తనలో) ఈ యుపన్యాస
మంతటిలోను "తారామనోహరా" యనుమాటయే నాకు పదివేలు. దేవ
గురువైన నీ యాశీర్వచనము సద్యఃఫలమీ నీయవలయునుగద!

జయం— (తనలో) నాయెదుట చంద్రుని పొగడుట— అందులో గో
రంతలు కొండంతలుగాజేసి పొగడుట నన్నుదూలనాడుటయే.
మాకింప చెడతిని మాకే ప్రతికూలుడుగానున్న యీ దేవగురువుదీనికి
తగిన ఫలము ననుభవించునట్లు చేయకుండిన నే నింద్ర కుమారుడను
గాను. (ముఖము చిట్లించి ఆలోచించి పెదవి విరచి) అయినను వీని
తో ఏమి?

బృహ— సుధాకరా! మధువాసరములను వర్ణించుచు నొకపద్యము
నాకుధారను జెప్పుము.

చంద్రు— చిత్తము (అని కొంచెమాలోచించి)

సీ॥ ఏలాలతాజాలడోలాసమాలోల
బాలామణీగాన భాసురములు।
క్షీరానిలవ్రాత ధారాచలచ్ఛాత
దూరాపతద్ర జోధూసరములు
మోదావహానంగ వేదాభరవభృంగ
ఖేదావహాజ్జాత కేసరములు
నాళీకదృక్కాంత పాళీనవైక్రాంత
కేళీపరిస్ఫూర్త కేసరములు॥

గీ॥ కనదగెన కుంతకలకంఠకంఠనాద
పటుభటాహ్వానకుపిత! బిభ్యత్ప్రపంచ
పంచసాయక మదహ స్తి పైసరములు
మీసరమ్ములు మధుమాస వాసరములు॥

బృహ—— బహుబాగుగ చెప్పగలిగితివి సుమీ !

చంద్రు—— ఇదియంతయు మీ యాశీర్వచన ఫలమే!

తార—— (తనలో) ఇంక నీప్రత్యుపకారమే మిగిలియున్నది. గురువునకో గురుభార్యకో ప్రీతింజేయకున్న కృతఘ్నుడవగుదువు సుమా!

(ప్రవేశము దేవదూత)

దేవ—— అదుగో! యాంగీరసుడు శిష్యద్వయముతో ముచ్చటించుచు చలువ పందిలిక్రింద సునాసీనుడైయున్నవాడు. నేబోయి యింద్రుని సందేశము దెలుపవచ్చును. (సమీపించి) దేవగురూ! దేవదూత ప్రణమిల్లుచున్నవాడు (అని మ్రొక్కుచున్నాడు).

బృహ—— కళ్యాణమస్తు. ఇంద్రునకు సేమంబేకద? అసురబాధ లేమియు లేవుగద!

జయం—— (తనలో) మా బాబయ్యగారికీ మాతను నాకొరకై పంపియుండవచ్చును.

దేవ—— గురూజీ! తమ యాశీర్వచన ప్రభావంబున యింద్రుడు సేమంబుగా నున్నవాడు. అసురబాధ లేమియును లేవు, గాని తమను

జయంతకుమార సహితంబుగ నొక యాగము సేయుటకై పిలువ నన్నిచ్చ్చటకు పుత్తెంచిరి. మరేమియు విశేషములులేవు.

తార— (తనలో) అమ్మయ్యా! ఈతని వదలిపోవును. చంద్రుడుగూడ వీని తోఁబోవునా?

బృహ:— అటులనా! (కొంచెముయోచించి) ప్రియసఖీ!

పంచచామరము

పయోజపత్ర నేత్ర గోత్ర పత్రభంజనుండు స।
త్ప్రయోగ్యమైన యాగమర్థి తానొనర్చు పూనికిన్
బ్రియంబునన్ రయంబు మీఱఁ బిల్వఁబంచె నన్నయో
వియోగ వేగ మెట్లు లోర్తువే గజేంద్రగామినీ॥

తార— ఏమి? చాలుచాలు!

శా॥ జాలెండే మిటి మాట హాపయనమా హాస్యానకుం బల్కుటో
బాళిన్నా హృదయంబు జూచుట కో నాపైగోపమో కాకనన్
జాలింబెట్టెడి లాగొ సైజమొ కటా నన్నొంటిం గానుంచి పో
నేలీలన్ మనసొగ్గె మీకునహహా యేనామిముంబాయుటల్॥
(తలపంచుకొని విచారము నభినయించుచున్నది.)

బృహ— ప్రియసఖీ! నీవు పట్టి వెర్రిదానవు సుమీ! ఇటు జూడుము. నే నీపై కోపగించి పోవుచుంటినా? దేశాంతరములకు బోవుచుంటినా?

తార— దేశాంతరములకు గాదు లోకాంతరములకే బోవుచుంటిరి.

బృహ— (నవ్వి)

శా॥ ముల్లోకంబుల నేలు రాజు సవనంబుల్ దీర్పరమ్మన్నచో
నుల్లంఘింపగరాదు గావున నదుద్యోగంబుగా జేసినం
పల్లాభంబున వేగవత్తు నిపుడాత్మన్ ఖేదముం జెందకే
యిల్లున్ వాకిలి జూచుకొమ్ము మదమత్తేభేంద్రకుంభస్తనీ॥

తార— (తనలో) ఇంకను నటించవలెను. (ప్రకాశముగా) నేనేమిచెప్పుటకు నోరాడకున్నది.

బృహ— సుకుమారీ! యిటు వినుము. పైనము తప్పదు.

చ॥ అలుకలు దువ్వరాదు సరసాన్నములన్ భుజియింప రాదుమై
కలప మలందరాదు తిలకంబు రకంబుగ దిద్దరాదు సొ
మ్ములుగయి సేయరాదు సుమముల్ ధరియింపఁగ రాదు సాధ్వియౌ
నలినదళాయతాక్షితన నాధుడు చెంగటలేక యుండినన్॥

తార— నన్నొంటిరి పాటు చేసి బోవ మీకాళ్లెట్లాడుచున్నవి!

బృహ— ఒంటిరి బాటేల? ఇంట చంద్రుడుండునుగదా? శిష్యబృందము లేదా! అదియునుం గాక నేనింతవరకేల చెప్పుచుంటినో గ్రహించ లేక పోతివిగద.

ఉ॥ ఇచ్చటి యగ్నిహోత్రితతులెవ్వరి పాలతిధి వ్రజంబులన్
వచ్చిన యాప్తబంధుల ఘనంబుగనెవ్వరు పూజసేయు వా
రిచ్చటనున్న శిష్యులకు నేగతి నన్నెడబాయలేని బ
ల్మచ్చిక నీవు వచ్చిన బలాయబలాప్రబలాఘ మంటదే॥

తార— మీచిత్తము నేనెట్లు చెప్పుటకును నోరాడకున్నది.

బృహ— అదియునుంగాక,

క॥ నటవిట వారవధూటీ
పటలీసంవృతము స్వర్గపట్టణమటకుం
ఘటకుచయుగ నతులకు నే
గుటయుచితమె వలదు మదిని గోపము నాపై॥

తార— ఒంటిగ నుండుట కలవాటులేక యిట్లనుచుంటిని. నాభయస్వభావము మీరెరుగనిది కాదు.

బృహ—అదినెఱుగనా? అందునకే నేను చంద్రునిటవిడిచిపోవుచుంటిని. ఈతండు.

చ॥ వయసున బాలుడయ్యు బరువంబగు తెల్విని చాలపెద్దయెం
తయుంగృహ కృత్యవర్తనలనన్ మరపించును నిచ్చలున్ సుజ్ఞో
దయమున నెండకన్నెరుగ డారయ జూచిన గందు మేను స
త్ప్రియహితవర్తనుండితని వేరుగ నెంచకుమా తలోదరీ॥

తార— (తనలో) చంద్రుని జేరుట కింతకన్న మంచి యదనెప్పుడు? మారా! నీపొంగరిక నే నణచెద! దైవమా! నాపైనిప్పటి కనుగ్రహము కలిగినదా! (ప్రకాశముగా)

మనోహరా! విరహ సాగరంబు దాటనేదారి! మీయానతికిం సమ్మతిం పబడితి. అన్నగారాతిజన్నంబు నేయించి పిమ్మటనిమిషమాత్రంబైన నచటనిలువ వలదు. మీమాటజవదాటనేనంతవేలనే? ఆత్మకుమారున్నిం

బలె యీయాత్రి కుమారుని బోషించెద. విశేషించి నేటి నుండియు ప్రాణపదంబుగా గారవించెద. మీకుం బ్రియుండట యాతనియేనుం బ్రియునిగా తలంప వలవదే. ఇచ్చటి విచారంబులు మాని నెమ్మదిగా పయనమ్ము పోయిరండు.

బృహ— ప్రాణసఖి! మేము బోయివచ్చెదము జాగ్రతసుమా! నీవువట్టి బేలవు. ( జయంత దేవదూతా చంద్రులతో నిష్క్రమణ)

తార— (తనలో) అమ్మయ్య! ఈపీడవదలినదికద. చంద్రుడు గురుని సాగనంపివచ్చులోపలనే సింగారించుకొనియెదను. అతని దయ యెట్లుండునో? కానిమ్ము? (నిష్క్రమణ)



# సుజ్ఞానోదయము.

## తృతీయాంకము.

### రంగము—ఉద్యానవనము.

—:o:—

(ప్రవేశము. నవమాలిక)

నవ:— నేటికి తారయదృష్టము పండినది. అందుకనే యంతమురియుచున్నది. ఆమె యేమినోమునోచెనో! యాచుక్కలగనికాని జతకూడుటయబ్బె. ఇంతకుయామె రేఖమంచిది.

పద్మా— (నవ్వుచు ప్రవేశించి) ఎవరిరేఖయే?

నవ— మన తారదే!

పద్మా— అవును. ఇపుడామె.

ఉ॥ ఒంటిగనబ్బెజంద్రుడిపుడొంటిగవాతెరజుంటి తేనియల్
గెంటనిప్రేమఁగ్రోలిరతికేళినిదేలకయున్నముత్యపుం
బంటవలంతివింటిదొర బాణకినోరువలేనటంచు నా
తుంటరిగుబ్బలాడి వగతోవిగతోరువివేకపాకయై॥

చంద్రుడు గురుని సాగనంపబోయెను.

ఆమెయు.

సీ॥ సరసాన్నపానము ల్శాకపాకంబులు
వింతవింతగ జేసి దొంతినునిచి
యొప్పైననలుగులు నుష్ణోదకంబులు
నొనరమజ్జన గేహమున నొనర్చి
చెలువొందువలువలు వెలహెచ్చుసొమ్ములు
పొందళ్కుతట్టల బొందుపరచి
కుంకుమంబురసంబు గోరజవ్వాజియు
రతనాలగిన్నెల జతనపఱచి
పువ్వుబెత్తులబొట్లముల్ నివ్వటించి
పొంకమున కేళి గృహమునలంకరించి
యింతియాతనిరాకకు నెదురుచూచు
చుండఁదారామనో వల్లభుండు వచ్చె॥

నవ— కాని. యిది బహు దుర్మార్గముసుమా!

పద్మా— యింతకు చంద్రుడంగీకరించవలెనుగదా.

నవ— అయినను చూతము.

పద్మా— చూచుటకేమున్నది. యామె తన నెరజాణతనమునకు తగిన హావభావావిలాసములు ముప్పిరిగొన, యప్పుడే తనహొయిలుగనపరుప ప్రారంభించినది. చంద్రుడురాగానే యాతనితో తనభావము వెల్లడి యగునట్లు "తారా మనోహరా!"

ఉ॥ ఊరకిబంపివచ్చితివె యొజ్జలునీగురుజమ్మచెల్ల సం
సారముమీదభ్రాంతి జనజాలడుదప్పగసాగిపోయె నే

దారునఖాడుగాపురలి దైవకృతంబునవొంటిపాటుచే
కూరిన దెంకనీమనసు కూరిమినేగతినాదరించెదో॥" అనియున్నది.

నవ— అతడందు కేమనెను?

పద్మా— యేమియు బదులుచెప్పక యూరకొనెను. అంతటితో యామె యూరుకొనక

గీ॥ పాన్పిద్దువోయెను లెమ్మిక సుద్దులేల
శిరముమజ్జన మొనరింప సరుసనేటి
కనుచు నమ్ముద్దుచాన యత్యాదరమున
నలపుసాలపును వలపుసయ్యాట మొసగ॥

నవ— (ఆతురతతో) తరువాత యేమిచేసినది ?

పద్మా— చేయుట కేమున్నది! తన మనోరథ మీడేర్చుకొనుటకు

గీ॥ చెండ్లగెలిచినమెఱుగు పాలిండ్లతోడ
బీరములు చూపవచ్చు జంబీరములను
జించి సారస్యమంతయు వంచినట్లు
నిమ్మపండ్లరసంబుల నెలతయంటె॥ మరియు

మ॥ తరుణీరత్నముబాలకైత కదళోదంచన్నఖాగ్రంబులన్
గురులన్ మెల్లన, జీరిపాయలిడి చిక్కుల్ పాయఁగాఁ బ్రాముచున్
గరపంకేరుహరత్నకంకణఝణత్కారంబు తోరంబుగా
వర గంధామలకంబుఁ బెట్టెను సుధావారాశి తోల్పట్టికిన్ ॥

ఉ॥ జాఱుపయంట జెక్కిబిగి చన్గవనిక్కఁగ బాహుమూలశ్రీం
గారరుచుల్వెలిం బొలయఁగానగు మోముచెమర్ప రత్నకాం

చీరవముల్ సెలంగ నభిషేక మొనర్చి లతాంగివానికిన్
మారునిమాలుసాగర కుమారునిఁ బట్టముగట్టెనోయనన్ ॥

నవ—— మనముపోయి యామె యేమిచేయుచుండెనో కనిపెట్టవలెనే!

పద్మా—— సరే! అదుగో యామల్లెపందిరవద్దకువచ్చి పూలుగోయుచున్నది. మనమా మాధవీలతా గృహముకడ కేగినచో యామెచేయున దంతయు కనిపెట్టుటకు వీలుగానుండును. రమ్ము! (అని నవమాలికను చేయిపట్టుకుని మెల్లగా పోవుచు నిరూపించి), చూచితివా!

సీ॥ పసమించు మాదరపాక పోరువలచే దడియారనొత్తి కుంతలము లార్చి
సాంబ్రాణిధూపవాసవనించిజవ్వాది చేనంటుచునుకురుల్చిక్కుదీర్చి
అలవిరివిరిజాజి విరులుఁజుట్టిన జాలుసిగను జంటరుమాల సొగసు పఱచి
తళుకుసనిచ్చలపు నెత్తమ్మిపూలబవంతి పుట్టంబు హాయలుగాఁ గట్టి నిచ్చి
కమ్మకస్తురిచే తిలకమ్ముదీర్చి । యొంటిపజ్రింపుబావిలీ లుంగరాలు
చేసరాలును సరిపెణల్చిలుక తాళి । పంకజేక్షణవాని కలంకరించె॥

నవ—— వంటయింటికేసి చూడుము. ఆమె పువ్వులు గోసికొని తనవెంట నడియాడు లేడి పిల్లనుచూడకుండగనే చరచర యింటిలోనికిపోయి చంద్రునకు భోజనప్రయత్నము చేయుచున్నది.

పద్మా—— అవునే.

చ॥ బలురత నంపుచెక్కడపు పళ్లెరముంచి పసిండిగిండిలో
సలిలమునుంచి ముత్యసరిసన్నపు బియ్యపు టన్నమొలుక ప

ష్పలు పొడికూరగుంపు కలుపున్వడియంబులు చారు లూరగా
యలు కలవంటకాలు పరమాన్నమిడెన్ లలితాంగివానికిన్ ॥

నవ— అబ్బ! తారయెంత పాతివ్రత్యాంగనయే!

పద్మా— కాని తనశీలము బూడిద గలుపుచున్నదిసుమా! అటుచూడు.

సీ॥ విరహాగ్ని నీరీతిగ రగె నామానసంబనినట్లు వెన్న గాచిన ఘృతంబు
పాలబోల్వయ సునీపాలు సేయుటకిదే యానవాలన్నట్లు లానవాలు
నెమ్మినీరీతి నాకెమ్మోవిగోరిలుమీ పూనినీవన్నట్లు పానకంబు
తనవచోమాధుర్య మెనయునాయివిచూడు మన్నట్లు మేలిరసాయన
ములు

నొప్పగాగిన్నియలనుంచి యుపచరించి
పాణిపంకజ కంకణ క్వాణమెసగ
బువ్వసురటిని విసరచు భోజనంబు
కాంతసేయించెదనమనః కాంతునకును ॥

నవ— అదుగో! చంద్రుడు భోజనము చేసి పుస్తకము చేతబుచ్చుకుని
మనకెదురుగానున్న లతామండపమున కావలగా వచ్చుచున్నాడు.
మనము కనబడుదుమేమో?

పద్మా— (అటు చూడకరయే) మనకుయతనికి చాలాదూరముగలదు- చెట్లు
చాటు. ఇటు తారను చూడుము.

సీ॥ తేటపటా గొజ్జగి నీటమజ్జనమాడి వలిపెచెంగావి పావడ ధరించి
పసిడిరాయంచు బవంతి చీరధరించి రాణించుపైటాణి రైకదొడగి
వదనాంబుజమున జవ్వాది చారికదీర్చిగొప్పగా నెఱజాఱుకొప్పబెట్టి
గమగమ వలచుకుంకుమము మేననలంది మృగనాభి పంకంబుమెడను
బూసి

మినుకకాటుక లేఖకన్గొనలదీర్చి
చరణయుగమున లత్తుకజాజు కొలిపి
తనయొయ్యారంబు నిలువుటద్దమునఁ జూచి
యిపుడుఁ గై సేసి గడిదేరు యీమిటారి॥

ఇకయామె యాభరణ సుభూషితురాలయి చంద్రునికడకేతెంచును. ఆమె యీదారినే వచ్చునేమో పోవుదమురమ్ము.

(అనినిష్క్రమింతురు)

---

## తృతీయాంకము.

### 2. రంగము. పూలవనము

(లతామండపమునందు పరివేష్టించి చంద్రుడు ప్రవేసించుచున్నాడు)

చంద్రు— (తనలో) నేటి దినము గురుభార్య చేష్టలు, మాటలు జూచిన నాకు మిక్కిలి సందియముగా నున్నవి. గురువుగారావూరలేరు. యేమికానున్నదో తెలియదు. కాని యామెవిడెమిచ్చినప్పుడుయామె ముఖముచూచియే తీరవలెను. నేటిదినము వెనుకటి వలెగాక స్నాన పానభోజనాదుల యందు భర్తకు భార్యసేయు సేవవలె బహుభక్తి శ్రద్ధలతో మెలంగుట యేగాక, ముసిముసి నగవులతో, నాయందు మిక్కిలి ప్రేమఁగలిగి యున్నట్లు సంచరింప జొచ్చినది. నిజముగా నన్ను ప్రేమించినదిగా నోపు.

తార— (అతిసౌందర్యముగా సింగారించుకొని ప్రవేశించి తనలో) చంద్రుడుభోజనముకాగానే వెడలి పోవుచుండగాఁ బిలచి విడెమిచ్చితిని. అతడా విడెమును పుచ్చుకొని భోజనసమయమందు నాకుసహాయ

ముగా కూర్చుండు నను కొనునంతలో యెచటికో కనుమరిగెను. అతఁడు ప్రతిదినము పాఠములు చదువు కొను లతామందిరముకడ లేఁడు. మరియొకచోట నాకై వేచి యుండునా? లేక నన్ను వేళాకోళము చేయ నుంకించి దాగియుండెనా ? బహుశః నా చేష్టలతనికిఁగిట్టక యెచ్చటికైనను బోయియుండడుగద!

(ఇటునటు వెదకుచున్నది.)

చంద్రు— ఇదిగో! యీ టక్కులాడి వచ్చుచున్నది. యిక యీరంగము నెట్లుమార్చునో? దైవమా నీదేభారము. (చదువుట నభినయించును)

తార— (తిరిగిచూచితనలో) ఇదిగో! రతియోగ్యమయిన రహస్య లతా మందిరమునందే చేరియున్నాడు. బలె! నాయూహ నితడు కనుగొని నాకై వేచుచున్నట్లు తోచుచున్నది. యీతని చూడనట్లు కేక వేసెదను.(ప్రకాశముగా)సుధాకరా! గురువుగారి యాజ్ఞకువ్యతిరేకముగ యబలనగునన్ను యింటనొంటరిగా విడచి యెచటకుబోతివి? ఇసీ! ఇందు చంద్రుడు లేడు. (నడచుచున్నది.)

చంద్రు— (ఆమెపై పునకు లతతొలగించి చూచి) నన్నే వెదకుచు వచ్చుచున్నది. ఆహా! యేమియీయామె యందము!

శా॥ ఔరా చక్కదనంబుహాసు మురిపెంబయ్యారె య్యొయ్యారమా
రౌరా మైసిరి హైసరే సొగసు మేలాహా విలాసంబుల
జ్ఝారే జవ్వనమద్దిరా వగలు మజ్ఝారేతనూ నిభ్రమం
బీరామామణి తోడ నీడుఁగలరా యీరేడు లోకంబులన్॥

ఏమి!

గీ॥ కొమ్మకాదిది బంగారు బొమ్మగాని
యింతిగాదిది జాజి పూబంతిగాని

కలికిగాదిది మరుని పూములికిగాని
భామగాదిది లావణ్య సీమగాని॥

తార— (తనలో) ఎంత వెదకినను కనుబడకున్నవాడు. వెనుకటి లతామంటపమున పాలిచ్చులేడిని చెట్లమాటునచూచి చంద్రుడను కొంటెనిపిలిచినను పలుకలేదు. ఎక్కడికేగెనో! (ఇటునటు వెదుకుట నభినయించి) ఇదుగో! నాబహిఃప్రాణము. లతామంటపమున కూర్చుని యున్నాడు. ఇప్పుడేమి చేయుదును. దగ్గరకు పోయి కూర్చున్నచో నేమిచేయునో చూతము. (అట్లుచేసి ప్రకాశముగా) సుధాకరా? నీవు కూర్చుండుట వలన యీచంద్రకాంత శిల యెట్లు చెమర్చినది. చల్లగానున్నది. కొంచెము నీప్రక్కనుకొంతసేపు కూర్చుండ నియ్యకొందువా! ఏమిటి యాలోచించుచుంటివి?

చంద్రు— (కొంచెము తొలగి తనలో) అయ్యో! ఎంతసమాధానము చేసికొంద మన్నను గురుభార్యకద! పోనిమ్ము!తొలగుదుమన్న, యీమె కూడ మన్మధునకే సహాయపడుచున్నది. దగ్గర కూర్చుండిన వనితనెట్లుపొమ్మని చెప్పను. అయినను యిట్లుచెప్పిచూచెద. (ప్రకాశముగా)

మ॥ ఇదియేమిచ్చటి కేలవచ్చితివి నీకింటంబనుల్లేవె యె
ప్పదు పోపో పతియూర లేనియెడ నీపల్కేక శృంగారముల్
సుదతుల్సేయుదురే రహస్యమున నిచ్చో జేరి నాచెంత నుం
డెదవిట్లుండినలోకు లూరకయసందేహింపరే చూచిన॥

తార— (చిరునవ్వునవ్వుచు)

ఉ॥ వచ్చిన నేమి రావలసి వచ్చితి నేపనియున్న దింట నీ
విచ్చట నుండగా మనసు కింపగు సొమ్ములు బెట్టి నంత నే
యొచ్చము లేని నీసరస నుండుట కేనియు నోచనైతి నా
యొచ్చటనున్న నేమి మన కేమిటి కెవ్వరు సంశయింపగన్ ॥

ఉ॥ కాకయె సంశయించినను కాదన నేటికి గంతుబారికిన్
లోకువగాని వారు ధరలోఁగలరే యిపు డిన్ని నాళ్లకై
చేకుఱె నొంటి పాటిచట చేసిన పుణ్యముచేత నింకనన్
గాకలఁ బెట్టకే విను ముఖాముఖి బల్కెద దాఁచనేటికిన్ ॥

చంద్రు— (తనలో) ఆహాస్త్రీలసాహసము.

క॥ నిలుపరమయ్యెను మునునా
తలచిన యదిమది విరాళి తహతహబడి తా
నెలమిన్ బైకొన వచ్చెను
కలకంఠుల నమ్మరాదు గాకలనైనన్ ॥

తార—ప్రియా!

ఉ॥ నీనెఱ నీటు నీసొగసు నీరసికత్వము నీవిలాసము
న్నీనవమోహ నాకృతియు నీయెల ప్రాయము జూచి చూచియున్
మానని ప్రేమ నేచి యభిమానముచే తమిదాచి యున్నినా
ళ్లేను మనోజు బారికి సహించితి పొంచితి మోహముంచితిన్ ॥

అదియుసరిగాక,

సీ॥ కమ్మని నీముద్దు కెమ్మోవిగని యాస మీఱంగ, గ్రుక్కి గ్రుక్కి ప్రేంకి ప్రేంకి
యొఱపైన నీదు పేరురముచందము జూచి గుబ్బచన్నుల బయల్ గ్రుమ్మి గ్రుమ్మి
యింపైన నీచెక్కు లీక్షించి ముద్దిడ నారకే వాతెర యొగ్గి యొగ్గి
చూడ చూడగ వింత సొబగైన నిసుగాంచి తహతహపైబడ తలచి తలచి

గీ॥ యెపుడు పై కొందు ముచ్చట లెప్పుడు గందు
నెపుడొ దవు బొందు విరహాగ్ని యెప్పుడు డిందు
ననుచు నేనుందు నేటికి నబ్బె సందు
లీలఁ బెంపొందు రతుల దేలింపుమిందు॥

చంద్రు— (తనలో) ఆహా! ఈమెస్త్రీజన సహజ మైనజవగు సిగ్గును విడచి తెగించి యిట్లు మాట్లాడు చుండ నేనేమి చేయువాడ. (ప్రకాశముగా)

క॥ తగునే నీకిది యెంతటి
తెగువే యీసుద్దికింత తెలిసిన జగతిన్
న్నగవారడి యపయశముల్
మగువా చేపట్టినట్టి మగవాని కగున్॥

తార— (కౌగలించు కొనబోవును)

చంద్రు— (తిరిగి తప్పించు కొనును)

తార— ఏమి! (కొంచెకోపముతో)

ఉ॥ ఎంచఁగరాని మోహమున నేనిటు పిన్నటనాటనుండియుక్
పెంచితిఁ బెద్ద జేసితిని బేర్మిగ బ్రాయము వచ్చి నంతనే
యెంచక మాటలాడెదిపుడిన్ని బ్రియోక్తులకిమ్ము బుట్టెగా
మంచిది నిన్నుగూడుటకె మాకుస్వతంత్రిములేక పోయెనే॥

శివ శివా! (చెవులు మూసికొని సాలోచనముగా)

చంద్రు— వనితా!

క॥ కోపము వలదిది నీవీ
పాపమునకు జొచ్చినం బ్రపంచంబున నిం
కేపాలతి మగని యొద్దక్
గాపుర మొనరించు వలదు కాపధ మతివా॥

తార— ఈ శ్రీరంగ నీతుల కేమి గాని యిదివినుము.

ఉఁ బాళిమనంబునం దణచి పాతియము వ్యర్థము చేసి యూరకే
దూలిన నేమి పుణ్యమని దోచెను మున్నల దారు కావన
స్త్రీలు గిరీశునిక్ గలయరే వ్రిత భామలు శౌరిఁ గూడరే
యాలలనాశిరోమణుల కందున నిందున నేమి చెప్పుమా॥

అదియునుంగాక

సీ॥ కన్నకూతురటంచు నెన్నక భారతీ తరుణీగూడడె నీపితామహుండు।
మేనత్త యను పేర మీర రాధిక తోడ నెన యడే నిన్ననీ యనుఁ
గు శావ।

వదినె యంచు నొకింత వావి లేకను జ్యేష్ఠు నెలతతో బొందఁడే నీ
గురుండు
మునిపత్ని యనకహల్యను పట్టడే నీదు సహపాఠి యగుపాకశా
సనుండు

గీ॥ యిట్టి మీవారి నడతలు గట్టి పెట్టి
యిప్పనే చెల్లన్యాయంబు లాడె దార
కడకు నీరంకు నీవెఱుగని విధాన
మూరెదవు నన్ను చలపోరి దోసకారి॥

చంద్రు— కొందరవినీతులయిన యందరు కావలెనా? అదియునుంగాక నీవుపైచెప్పిన జాపితా యందు ముందు కాముక జనులు మనలను గూడ నెక్కించి శాశ్వత యప్రఖ్యాతిని యూడి పోసు కొందురు. అదిగాక యిహపరములకు చెడవలెను. నీతి శాస్త్రవిదూరులము గావలెను.

తార— ఇవియన్నియు నేనెరుగనివి గావు. నీతిశాస్త్రము రచియించిన వారి హస్తముల యందే చురుకు గాని, మనో దౌర్బల్యము వారికే యెక్కుడు. నీతి యితరులకు సులభముగా చెప్ప వచ్చును గద. చూడుము నీతిశాస్త్రకోవిదుల రహస్యమును నీవుగ్రహించలేకపోతివి. నీచదువు లెందుకు. నీయమాయికత్వమునకు నాకునవ్వువచ్చుచున్నది.

ఉ॥ లోకము లోన గొందరబలుల్సతుబంధ నియింపలేకన
స్తోకము నీవనన్య పురుషుల్ దమ కాంతల నంట కుండ తా
టాకులలోన వ్రాసిరి పరాంగన గూడిన పాపమంచు న
య్యాకుల పాటుఁ జూచి యిపు డాకులపాలెనయంగ నేటికిన్ ॥

చంద్రు— నేనది నమ్మజాలను. ఇది మిక్కిలి పాపము. నన్ను వృథాగా పాపప్రసంగములకు దింపకుము.

తార— మనోహరా!

ఉ॥ పాప మటంచు నీపనికి పైకొన కుండితి వేని కంతు సం
తాపముచేత నాతనువు దాళఁగ లేదిసుమంత నీకు ని
ప్పాపము బోవుటెట్లు నను పాలన సేయుము నీవు దీననా
పాపము నాది ప్రాణ పరిపాలన పుణ్యము నీది వల్లభా॥

చంద్రు—కాంతా!

తార— ప్రియకాంతా యని పిలువ రాదా?

చంద్రు— ముందు నీపాతి వ్రత్యము చూచు కొనుము.

తార— మనోహరా! నాచేత యెందుకు ప్రేలించెదవు. నాపై జాలికలుగదా? నీమనస్సు కరుగదా? యీతరళ్ళ మెందుకో?

ఉ॥ ఏలర జాలి బెట్టి దిపుడేలర వేగమె యెన్నిపువ్వులన్
వ్రాలదు తేఁటి యట్లు మగ వాడను వానికిఁ దోసమున్నదే
బాళిని దానె పైఁబడిన భామనుబిగ్గ కవుంగలించినన్
జాలదె యింద్రభోగ పదసౌఖ్యమునన్ మరి వేఱె యున్నదే॥

(దగ్గర చేరబోవును)

చంద్రు— వనితా! నీవిట్లు మన్మథ బాణా పరంపరలకు లోనయి కుంద నేలకీ

యోర్చు కొమ్ము. గురుని యందేమనస్సు నిలుపుము. చెడి పోకుము.
చెప్పినది వినుము.

తార— వయసుకాడా! మనోహరా!

సీ॥ చిత్రజాకారనీచెలువు జూడగలేని
కమ లాక్షినిలువాలు గన్నులేల।
కాంతుడనినుఁజేరి కౌగిలింపగలేని
జక్కవగుబ్బెత చన్నులేల
ప్రాణేశనీప్రక్క పవ్వళింపగఁలేని
తరలాక్షిచక్కని తనువదేల
రమణనీతోఁగూడి రతికేళిఁనెనయని
బాలికామణియేల ప్రాయమేల

గీ చిన్నవయసుననుండియు నిన్నెకోరి
యున్ననను బోయ మరునికి నొప్పగించి
తేలజూచిన నిన్నునే నేలవిడుతు
కోర్కెదీరంగ నీకపైకొందుగాక॥

చంద్రు— అయ్యో భామినీమణీ! యెంతజెప్పినను బూడిదలోపోసిన
పన్నీరుజేయుచుంటివిగదా!

తార— నీవా? నేనా?

చంద్రు— ఏమిటి?

తార— జవ్వనము.

చంద్రు— నీవేమనినను నేనంగీకరింపజాలను.

తార— చ॥ సరసుడ నీమనంబునకె సమ్మతిగావలెనంచు నింత సే
పరసితి యాఁచియాఁచియిఁక సంగజసాయకకీలికీలచే
నరనిమిషంబు నోర్వ నధరామృతమానగ నిమ్ము కానిచో
డెరవనుజంపినట్టి కొలదీరక తాఁకు సుమీ మనోహరా॥

మనోనాయకా మారుమాట చెప్పవలదు (అని కౌగలించుకొనును)

చంద్రు— (తెల్లబోవుచున్నాడు) (తెరపడును)



## 3వ రంగము.



## ఉద్యానవనము.



(తార, చంద్రుడు భుజములపై చేతులు వేసికొని ప్రవేశింతురు)

తార— మనోహరా! ఈమాధవీలతను చూచితివా! ప్రియులొకరినొకరు తనివిదీర కౌగలించుకొనునట్లీ తమాలవృక్షము నాలింగనము జేసి కొనుచున్నది.

ద్రు— దానికేమిగాని యారాయంచల జూడుము. మందగమనము జే

మరాళనామమును సార్థకపరచుకొనుచున్నవి. ఆపైనజాడు మొక రాయంచ తనభర్తనువదలి మరియొక పురుషరాయంచ నోటినుండి దొంగతనముగా మృణాళములను తీసికొని కొరుకుచున్నది.

తార— అదికూడ భర్తభయముచేత నేకదా! భర్తకనుమానపించి యట్లుచేయుట. ఇప్పుడాయంచ యేమిచేయునో చూడవలసినదే. (చంద్రుని తనివిదీరముద్దు గొనుచున్నది).

చంద్రు— చూడు! చూడు! భర్తయంచ తనభార్యను చీవాట్లు పెట్టుటకో యనునట్లు దానిని కనుగొని దూరముగా తీసుకొనిపోవుచున్నది.

తార— అవును. స్త్రీలుభర్తల యడుగులకు మడుగులొత్తవలెనుగదా!

చంద్రు— గాని నాకీయంచల స్థితినిబట్టిచూడ మనకు త్వరలోనే వియోగముకలుగునని భయమగుచున్నది.

తార— ప్రాణేశ్వరా! పురుషుడవైన నీవేభయపడెదవేల? ఈ శకునములతో మనకేల? మిగులయలసితివిగాబోలు. గృహాంతరభాగమున కేగుదమురమ్ము.

(నిష్క్రమించుచున్నారు)





# సుజ్ఞానోదయము



## చతుర్థాంకము.



### 1 రంగము. బృహస్పతిగృహము.



(ప్రవేశము బృహస్పతి, తార)

తార—(భర్తకువిసరుచు)నాథా! ఇంద్రుని క్రతువు సానుకూలముగ నెరవేర్చితిరా? మార్గంబున శ్రమంబులేక క్షేమముగ నుంటిరా? నన్ను విడిచి యిన్నాళ్ళుండుటకు మీకెట్లుతోచినది? అవును. గాకేమి? స్వర్గపట్టణము "వారవధూటీ పటలీసంవృతము", యనిగదా శలవిచ్చియుంటిరి. (నవ్వి)ఇంద్రుడు మిమ్ము బహూకరించెనా? మీ యుదంతంబంతయు సాంతముగా నెరింగింపవేడెదను.

బృహ—(నవ్వి) బోటీ! నీకీసందేహమేల?

మ॥ క్రతువాయెన్ సుఖమంటి వాసవునిసత్కారంబుఁ గైకొంటి వి।
కృతు లత్యుత్తమ రత్నభూషణ ధనవ్రాతంబులర్పించి రు।
న్నతి నొక్కింట గొఱంత లేదచట చానా నామదిన్నిందు స।
గతిలేకుండుట లోకక్ష్టేకొదుః యోగక్షేమమే నీకిటన్ ॥

చంద్రు—(ప్రవేశించి) గురువర్యా! నమస్కారము (సాష్టాంగపడుచున్నాడు.)

బృహ—కుమారా! కళ్యాణమగుగాక! లెమ్ము!

తార—(తనలో) అయినకళ్యాణమేమో యెవరకేయైనది.

చంద్రు—(లేచుచున్నాడు)

బృహ—కుమారా! నేమంటె? పాఠములుచింతన చేయుచుంటివా? తార నిన్ను ప్రేమించి పోషించుచుండెనా? అగ్నిహోత్రములయందప్రమత్తుడవై మెలంగుచుంటివా? సహపాఠులకు పాఠములుచెప్పుచుండువా?

చంద్రు—గురువర్యా! అన్నిటియందును యప్రమత్తుండనై, యింటమీరులేని లోటులేకుండ, గురుభార్యాయాజ్ఞను మీరకకార్యంబులనిర్వర్తించుచుంటిని. తమభార్యనన్ను ప్రేమించిపోషించుచునే యుండెను.

తార—(కన్నుగీటుచున్నది.)

చంద్రు—(పళ్ళుబిగించి వద్దని సంజ్ఞచేయుచున్నాడు.)

బృహ—మంచిది. నీవుబోయి హోమద్రవ్యముల సిద్ధపరుచుము.

చంద్రు—(నిష్క్రమించుచున్నాడు.)

తార— నేబోయి స్నానమునకు సిద్ధము చేసెదను. (నిష్క్రమించుచున్నది.)

బృహ—(తనలో) వీరి చేష్ట లనుమానాస్పదములుగా నున్నవి. అయినను బరికించెదగాక! (నిష్క్రమించుచున్నాడు.)

—:o:—

## 2వ రంగము.

—:o:—

### బృహస్పతి గృహాంతర్భాగము.

—o—

(తారప్రవేశము.)

తార—అబ్బబ్బ! మద్భర్త వచ్చినది మొదలు చంద్రుని చేతులార కౌగలించనయిన వీలుగాకయున్నది. ఇప్పుడీదారిని యాతండు రావచ్చును. ఒకసారిస్పర్శసుఖ మనుభవింతునుగాక!

చంద్రు—(వెనుకనుండిప్రవేశించి తారకండ్లుమూసి) మనోహారీ! నా పేరు చెప్పుకొనుము.

తార—(వదిలించుకొని) వెర్రివాడా! (యనికౌగలించుకొని) నీకంఠ ధ్వనియే నీ పేరుచెప్పనుసుమా! అబ్బ! ఎన్నిదినములకోయి, యిట్లుతిరిగి నిన్ను కౌగలించుకొన గలిగితిని.

చంద్రు—సఖీ! ఇక నేబోవలెను.

తార—ప్రియా!(గట్టిగా కౌగలించుకొని) వెళ్లుము.

చంద్రు—(నవ్వుచు) నీప్రేమపాశముల చేత నే నామనస్సునుకట్టియుంచి, యిప్పుడు బాహులతలచే బంధించి పొమ్మనుచుంటివా? నిన్నువదిలించుకొనలేనా?.

( తెరలోధ్వని)

చంద్రు—అరుగో! గురువుగారు!(అనిబెదరించును)

తార—(విడువక నే) మనోహరా! ఈటక్కులు నే నెరుగనివి కావుగాని, నీవు మిక్కిలిసుకుమారివి. నీశరీరము నా మోటు చేతులమధ్య పడియెటుల నలిగి కందినదియో చూడుము. విడువనా?.

చంద్రు—సుకుమారుడననకుము. బలహీనుడననుము.

తార—యెందువలన?

చంద్రు—అబలల చేతులలోజిక్కి, వారికౌగలింతలను తప్పించుకొన లేకపోవుటవలన.

బృహ—(వీరికివెనుకగా ప్రవేశించి,వీరిని చూచి) అరె!దుర్భాగ్యము!(తలపంకించి వెనుకకుబోవుచు తనలో) ఇచ్చటనుండి వీరిసంభాషణ వినవలెను.

తార—(చంద్రునిముద్దుబెట్టుకొని) అట్లయినవదలుచున్నాను. పొమ్ము.

బృహ—(తనలో) వీరినియధోగతి పాలగునట్లు శపింతునా? ఈదండము చే వీరిశిరస్సుల వ్రక్కలు చేయుదునా?అయ్యో! స్త్రీహత్యయగును.

చంద్రు—(నవ్వి) చంద్రవదనా! పోయివచ్చెద దయయుంచుము. (అనితా రనుముద్దు పెట్టుకుని తారతో నిష్క్రమించును.)

బృహ—(ప్రవేసించికోపముతో) ఆహాహా! యుగమహాత్మ్యము! వీరికితగిన ప్రాయశ్చిత్తమును చేయుదునుగాక! (అనినిష్క్రమించుచున్నాడు.)

---

## 3వ రంగము.

### (గృహాంతర్భాగము నందలి పడకటిల్లు)

### (తార, బృహస్పతి, ప్రవేశము.)

---

తార— నాధ! ఏమి యింతకోపముతో నుంటిరి.

బృహ— (కోపముతో)

ఉ॥ ఓసియిదేమి యీనడత యొప్పదు సాధ్వివటంచు నమ్మితిన్
మోసమువచ్చె వీనినతి మూర్ఖుని శిష్యుడటంచు నెంచితిన్
వాసవ ముఖ్యసర్వ సురసన్నిత చర్యుడనై చరించునావాసియు
వన్నెయుందొలగి వచ్చెను దుర్యశమేమి చెప్పదున్॥

తార— అట్లనుచుంటిరేమి?

బృహ— ఛీ! ఊరకొనుము.

క॥ పెద్దలులేని యెడన్ మి
మ్మిద్దర నేనొంటి నునిచి యేగఁగనగునే

ముద్దియయేమని చెప్పదు
పెద్దతనము బోయె బుద్ధి పెడతలబట్టెన్ ॥

తార— ఇప్పుడేమి వచ్చినదినాథా? కిట్టనివార లేమయిన చెప్పిరా యేమి?

బృహ— (వినకయే)

ఉ॥ శివశివ యెంతపాతకము సేయగ నోగ్గెనుసిగ్గుమాలిపి
డవిరళ భక్తిమైజనని యంచని నెన్నుచు దంౘ్రియంఘ్రు న
న్నవిరతమున్భజించి నిఖిలాగముల్చదివిట్లు చేసెనే
యువిదలనమ్మువే పురుషులుర్వి నవిశ్వసనీయు లెన్నగన్ ॥
అరెరె! చంద్ర! మూఢాత్మ! ఎంతపనిజేసితివిరా!

తార— (తనలో). ఈయన యిది యెట్లు గ్రహించి యుండును. (ప్రకాశముగా). చంద్రుడు! బహుబుద్ధిమంతుడే. ఆతడేమైన చేసెనని యెవరైనా చెప్పిరాయేమి?

బృహ— ఛీ! పా పాత్ముఁరాలా! ఎంతకైన తగినదానవే! ఛీ నీబ్రతుకేల? కాల్పనా! అయ్యో! నిన్ననవలసినదేమి?

చ॥ నిలకడ యున్న వావినహి నేస్తము నాస్తి భయంబు లేదు చంచల
హృదయుల్ దురాత్మకుల సత్యలు కాంతల దాంత లింతయున్
దెలియక నాన్యపాలకులు నిగ్రహమొప్పగ పోతుటే గెయున్
బాలయగనియ్య రంతిపురి పుత్రులనైనను నమ్మరెంతయున్ ॥.

తార— (తలవంచుకొని) మీమాటలు నాకర్థమగుట లేదు.

బృహ— ఛీ! ఛీ! (అని తన్నబోవుచున్నాడు.)

తార— (తనలో) ఏమిచేయుదును.

బృహ— ఓసి! మానిని! కాదు! కాదు — మద్హృదయ బడబాలినీ!

గీ॥ తెరవమీశీలమెల్లను దివ్యదృష్టి
జూచివాడను నీవింక దాచవలదు.
నీవె చెనకితివో లేక నిన్నువాడె
చెనకెనో తెల్పుదెలిసి శిక్షింతునిపుడ॥

తార— (ఏడ్చుచు) నాథా!

సీ॥ ఏమని యుత్తరం బేనియ్యగలదాన నెందునదీరు మీసందియంబు। ఇంకనాపయి దయయెట్లు గల్గునుమీకు సైచకయున్న నాజన్మమేల। పాపపుదైవంబు బాపెనో మనలను తలను వ్రాసిన వ్రాలు తప్పదింక। దప్పొనర్చిన వారి దండింతు నంటిరి తప్పొనర్పనివారు ధరణిగలరె।

గీ॥ యబ్జభవు కూతురైన యహల్య మొదలు । నేర మొనరించెననిచో నేర్చినడువ । నొకరి తరమానె మగవార లోర్వ్వలయు । కానిచో వట్టినగుపాటుగాదె మీకు॥ (అని కాళ్లపైబడి బోరుబోరున నేడ్చుచున్నది.)

బృహ— (కాలితోవిదలించి) పాపాత్మురాలా! నన్నంటకుము.

తార— (క్రిందపడి మూర్చిల్లును.)

బృహ— (తనలో) నేనేమిచేయుదును. ఏమిచేయుదనని యోచించనేల? అరే దురాత్మ! చంద్ర! గురుద్రోహి!

"కళంక యుక్తుండవై చిరకాల మపకీర్తిని బొందెదవు గాక!" కానిమ్ము! ఏనినింతటితో వదలివేసెదను. ఈదుర్మార్గురాలిని శిక్షింపక యూరకొనినచో నేనుమిక్కిలి నిందార్హుడ నగుదును, (భార్యనుద్దేశించి)

"ఓసి! దుర్మార్గురాల! నీవుబుట్టు సంతానము యిరుగు పొరుగులేక బహుయోజనముల దూరమున పడియుండను గాక." (నిష్క్ర.)

(తారక్రిందనే పడియుండును) అవనికపడును.

# చతుర్థాంకము.

## 4. రంగము. బృహస్పతిగృహము.

(తారప్రవేశము.)

తార— మద్భర్త మాకు శాపంబులనిచ్చిన నిమ్మెనాక! చంద్రుని పిలచి "నీచదువులు పూర్తిగ సాగినవి. యికతలిదండ్రుల చూడ బొమ్ము" యని యాతని యింటికంపి యేలవెడల గొట్టవలెను. అయ్యో! వాని రూపము నాకన్నుల యెదుట కట్టినట్లున్నదె! అబ్బబ్బా!

ఉ॥ చేరల కెచ్చు కన్నుగవ చెక్కుల యందము చెప్పశక్యమా
బారలగొల్వ నౌనురము బాహులు జానులు మీఱుమోవిబిం
గారు కవుఁ బ్రవాళములు గైకొన పంక్తులు లోకసంపమే
ఆరసికత్వ మాగుణము లారతి చాతురి వానికే తగున్.

నా కంతు సామ్రాజ్య పదవి యందు యిరుగుపొరుగు నత్తలక్కల కన్నెఱ్ఱబాఱునట్లు సుఖించితిని. నేను వారినిత్తృణీకరించుచు కేరుచుందునే! ఆనాటియానందము, నా రాణి పదవియు, నేడేటుపడి పోయెను! ఉస్సు! అబ్బ!

ఉ॥ భామల జాతిచేష్టిత విభావములెల్ల నెఱుంగు కామసం
గ్రామకిరీటియైన విట రాయఁడు మోహనమూర్తి యెంతయున్
నామది చల్లజేయు ప్రియనాథుఁడు నన్నెడ బాసెనయ్యయో
యీమగఁడేల యీసదన మేటికి తక్కిన వేమి యేటికిన్॥

ఇంత సంపద నాకు గలిగె గదా యనియువ్విళులూరుచుంటిని దీనికియెంతప్రయత్నము యెంతయోపిక యవలంభించితిని.

ఉ॥ కోరక కొన్నినాళ్లుమది కొంకు దొఱంగక కొన్నినాళ్లుచే
కూరక కొన్నినాళ్లు జనకూర్మి విటుండొక డబ్బెనబ్బినన్
వారక పేరు లేని ప్రీతి బంధము పెన్మిటినంచు వచ్చినా
దారక పోరి బాపెనకటా మగ నాలయిపుట్టి జెల్లునే॥

వానిని ధలచిన కొలది దుఃఖము హెచ్చగుచున్నది.

సీ॥ అలయించు నొకవేళ బొలయల్క చిప్కల సొలయించునొకవేళ సొగసువగల
గరఁగించు నొకవేళ గళల యింపువ లంటి మఱగించునొకవేళ మెఱుఁగుమోవి
బలికించునొకవేళ బావురాపల్కులు కులికించునొకవేళ గొసరినవ్వి
యానించు నొకవేళ సరిది మోమున మోముబూనించు నొకవేళ బుర్ఘుసురతికి

గీ॥ జిగురు విలుకాని నైన నాసొగసు కాని
యొప్పలేదన్న మదిముది దప్పినట్టి
యీమగండేడ నేడేడ యేడకేడ
నేటికీ పోరు ఏని పొందెవతె గోరు॥

ఇప్పుడు దుఃఖించిన లాభ మేమి?

ఉ॥ ఆడికలైన నేమి మగడారడి బెట్టిననేమి చుట్టముల్
వాడక యున్న నేమి సరివారలు నవ్విన నేమి కాపురం

జూడిన నేమి నాదగు ప్రియుండిలు బాసి చనంగ నేనుమ౯
దోడనె పోవనైతి మదిదోచక పోయె నికేమి సేయుదు౯॥

ఈ మదనబాధకు మందేమున్నది. ఓయీ మదనా! చంద్రుని సన్నిధిని నిన్ను మరచియుంటినని నీ చెలికాడయిన యాతని పరోక్షమందు నన్ను బాధించుచుంటివి. నీమిత్రునితో యీసంగతులు చెప్పెదనని భయమైనలేదా! అదిగాక యెప్పుడును యబలలతో నేగదా నీయుద్ధము! అనంగా! ఛీ! క్రూరాత్మా! నీవెవ్వడవురా నాజోలికి రాను. నేను చంద్రుని ప్రియాంగననురా! ఛీ! పొమ్ము చేతనైన నీబాణపరంపరల యాతనిపై ప్రయోగించి యాతనితో డీకొమ్ము. నిన్ను బహూకరించెదను. అయ్యో! ఈతడతనిని బాధించునుకాబోలు.

గీ. ఏకరణినైన వానితో నెనయుటొకటి
కానిచో మేనిపై నాసమానుటొకటి
యింతియే కాకమగడంచు నితని మొగము
జూచి సైరింపలేను త్రిశుద్ధిగాను॥

గాక నే చేయునదేమున్నది?

గీ॥ మిగిలియున్నది యొకదారి మేనుదొరగి
పతిని దిఙ్మండలంబున బడయుటొకటె
దానికీదారి యాదారి తడయనేల
నడిమిగోదారి తక్క - నన్యంబులేదు॥

ఇదిగో గోదావరిలో దుముకుచున్నాను.

(అని మూర్ఛపోవుచున్నది.)

(బాలయోగిని ప్రవేశము)

బాల—(తారనులేపును)

తార— (లేచి యోగనిని కాగిలించుకొని విచారించును)

బాల— తారా! నీవిట్లు మూర్ఛబొంద కారణంబేమి? ఇంతదుఃఖము నీకు కలుగుటకు గతంబేమి? ప్రియసఖినగు నాతో చెప్పుటకు నీసందేహ మేమమ్మా!

తార— (ఊరకొనును)

బాల— నాకు తెలియక కాదుగాని నేనుపూర్వపు పద్మావతినిగాను గనుకను యోగినిమత మవలంభించుటచేతను, ప్రాపంచిక విషయములన్నియు విడచితిని. అయినను నీవు చెలికత్తె వగుటచే నీదుఃఖము బాపతగిన ప్రయత్నముచేసెద. నీ మనోగతం బెరిగింపుమమ్మా! ఇతరులు కోర కుండ మేమే పనియు చేయరాదు.

తార— సఖీ! నీకు తెలియని దేమిగలదు. నా ప్రాణములతో నాబొందె ను జేర్పుము.

ఉ॥ నీవయెటేంగి యుండుదువు నేనును జంద్రుడు నే స్తమాటయుఙ్
బూవునుదావియున్ ఏలెను బొందుగవాడును నేనునుండుటల్
నావిధి పెన్నికైయిపుడు నన్నునువానిని బాపెనేనికఙ్
భావజకీలికీల క్షణమాత్రము నోర్వఁగజాల గోమలీ॥

వానివిషయమై నేనిజముగా మోసపోతిని. సౌఖ్యములు క్షణభంగురములనియు, పగనాలను నా యాటలెల్ల కాలము సాగవనియు నెంచలేకపోతిని. గంపెడాసతో పెంచిన యాప్రణయలత పుష్పములను మనసుదీర కోసికొనలేక వెఱ్ఱినయితిని.

సీ॥ తడవు చూచిన దృష్టి దాపనంపనివాని
సొగసెల్ల దప్పక జూడవెఱతు
మొనగుబ్బలదిమి క్రమ్మిన గంపుననివాని
లేతమేనును కౌగలింపవెఱతు
నోడిబడ నమృతంబు దొలుకనంచనివాని
నునుమోవి గట్టిగా నొక్కవెఱతు
జెమటచే జెలువంచు చిందునంచనివాని
నెనయుచో గసిదీఱ బెనగవెఱతు॥

గీ॥ గానియొకనాడు నానన్నె కానిగాంచి
కదిసి తనివార బిగ్గన గౌగలించి
నునుఁబెదవి నొక్కి రతికేళి బెనఁగిపొక్కి
యేలుకొనలేక నీరీతి జేలనైతి॥

నా యాకారమును జూడుము. బొంది యిచ్చటను ప్రాణములుపంచ్రము నికడను యున్నవి.

ఉ॥ అన్నము నిద్రయుం జెరుగ నశ్రుజలంబులు నిల్పఁజాల మేన్
సన్నగిలెం దిటంబుచనెఁ జాలవిరాళియు మీఱె నేమియున్
గన్నులకింపుగాదు త్రిజగంబులు లేననునట్లు దోఁచెమో
హోన్నతి మేనఁ బ్రాణములు నున్నవొ లేవొ యెఱుంగనంగనా॥

సఖీ! వేయిమాటలేల నన్ను గాపాడ యావిధాత నిన్నిటుకుంబంపె!
నన్నునీ కడుపునగన్న బిడ్డగా నెంచి (పాదములపై వ్రాలి)

శా॥ ఏఁటంకంజనెనో మదీయదయితుం డెచ్చోట నున్నాఁడొ నే
నేవెంటన్ ప్రియుమోముఁగాంతు నికనే నెవ్వారితో దెల్పుదు
న్నీ తవ్యాజ పరోపకారవు గనే నెమ్మి నన్నుంబ్రోవవే
పోవేవానికి నావెత ల్దెలుపవే పుణ్యంబు నీకయ్యెడున్॥

బాల— సఖీ! నీవింతగా వేడుకొనవలెనా! నీనిన్ను దినాంతమునకు మున్నె నీ కాంతునిచెంత నుంచెద. చింతింపకుము. నేనిదెబోయివచ్చెద.

(ఇద్దఱు నిష్క్రమణ)

## 5 రంగము-కాననము

———:0:———

### చంద్రుడు ప్రవేశము.

చంద్రు— ఉ॥ ఆతటితాత వ్రేసినటు లాతడు పొమ్మని వీడనాడగా
నాతరలాక్షి చిప్పిలెడు నశ్రుల నప్పళి నప్పళించుచున్
దాఁదలు పోరనిల్వనయ నమ్ముల నేపయనమ్ము దెల్పసం
జాతవిషాదయై యనుపజాలని చందము లెంచగూడు నే॥

ఇంతకు నాది బుద్ధి పొరబాటు.

ఉ॥ పొమ్మని నంతరాదగునె బుద్ధికి మోసమువచ్చెనప్పుడీ
కొమ్మనువెంటబెట్టుకొని కొంకకవచ్చితినేని నన్నుదా
నమ్మని యేమిచేయునొక డష్టమెయేనటుజేయ మిష్టదా
ముష్కరమైనకంతువిరిముల్కులకు న్దసు వొప్పగించెదన్ ॥

దాని నేమని వర్ణించువాడను.

క॥ తారలఁ గెలుచును నఖరుచి
తారల తరళాక్షి రూప తారుణ్యములం
దారం జేయును మనసిజు
దారం జిగిమోవి పంచదారం గేరున్ ॥

మరియు.

శా॥ ఆమోమందము నాకసుంగవబెడం గామోవి సింగారమా
గోముస్వస్తవగబ్బి యాగొనబునిగ్గు ల్మీరునూగారుసొ
రామించు న్దొడజగ్గులో నడల యొయ్యారంబు లయ్యారెయా
భామారత్నముఁ జూచి చూడవలెనా పద్మాక్షి నింకొక్కతెన్ ॥

(తెరలో "క్రో క్రో" యని పికముకూయును.)

చంద్రి—(ఆలకించి యదరిపడి) అంతమాత్రమున కీవెరి యేమియందువా?

ఉ॥ చక్కదనాలకేని రుచిసంపద చిత్తరు బొమ్మయున్ గడున్
జక్కనగాదె యంత సెబజాణతనం బొకచోటగానగా
మక్కువలోకమందె నహీ మాటలపోఁడిమి దానికేతగున్
దక్కిన భామినీమణులు దానిశతాంశము బోలనేర్తురే॥

ఇపుడేమారిదువు? ఇకవిని పోకపోవుచుంటివా? అవును. దాసిమాటల ముందర నీవొక లెక్కయా? పోనిమ్ము! పొమ్ము! మాపీడవదలిన౯.

సీ॥ జటువుగుబ్బల నొత్తి పక్కకుపహత్తి నాహాసుచెల్లించిన యందగత్తె
కొనగోరునాటించి కూర్మి పాటించినా తమకంబు గెరలించు చిలిరుబోణి
వాతెర పొలిచ్చి వగలజేలించినా వలపునీడేర్చిన వన్నెలాడి [డి
పావురాపగబల్కి పైకొనికుల్కినా ముచ్చటల్సమకూర్చు ముద్దు
గుమ్మ

గీ॥ మక్కువ నెసంగి కోరికినమ్ముడు పొసంగి
గారవించిన కొమ్మ బంగారుబొమ్మ
ననవిలుతు విద్యలకు సొజ్జ నాదుపజ్జ
కెన్నటికిజేరు నావంత లెప్పుడుదీరు॥

(ఆలోచించి తలపంకించి)

చ॥ ఎసగిన నెయ్యపున్నినుక నెంతయుమోడి ముసుంగు వెట్టియా
కుసుమ సుగంధియున్నపుడు కొంకుచు నే జెయిదాఁచ
నిదప్రిచే గసరినయట్లు మత్కరము గబ్బిచనుంగవ పైకిఁదార్చిమై
నుసులుచు నీవిజార్చిన మనోహర లీలల నెన్నశక్యమే॥

(మల్లెపూవులు రాలును. ఉలికిపడును)

చ॥ మలయజగంధి దాశిరసు మజ్జనమై తెలిపల్వయొంటి కొం
గెలమిధరించి రైక ధరియింపకయే కురులార్చుచున్న నే
నలమిని కౌగలించుకొన నాహరిమధ్య యనంగసంగరా
కలనబెనంగినట్టి రతికౌశల ముత్సజలోదలం చెదక౯॥

ఏమి నాకెఱి? ఇక నీసంగతి మఱచిపోయెదను (ఆలోచించి)
ప్రాణసమగు నెచ్చెలీ!

ఉ॥ నింతువు నాదుకోర్కె గమనింతువు కేళికహంసకంబునా
నింతువు రొమ్ముగుబ్బల దనింతువు పాదుపు కేళిచేత బూ
నింతువు తోనె కేళికి గణింతువు నాదుగుణంబు లెల్లప
ద్మాంతేలలోన నీకు సరిగానజగాన నగాన తన్వినీ॥

(ఇటునటుతిరిగి యొకచో నతికిలబడును.)

(బాలయోగిని ప్రవేశించును.)

బాల—(తనలో)ఇతడేదియో మాట్లాడుచున్నాడు. ఇచ్చట పొదచాటు
నను౦డి వినుచుందును.

చంద్రు—(మేయుచున్న లేడి నుద్దేశించి) చెలీ!

చ॥ విరహదవానలంబునను వేగుచునున్నమటంచు నిద్రయుం
జెరుగక నేనుజాలిబడ నేమనిపల్క విదేమియల్కనీ
సరసతగంటినీబిగువు చన్నుల కైవడి నీదుచిత్తముల్
హారిహారియింతయేల కఠినత్వముబూనెను మానినీమణీ॥

నా ప్రేమ నీవెరుగనిది కాదుగద. (విచారముతో) నేను చేయుపనుల
యందేమయిన లోటుకలిగి నన్ను విడనాడితివా? అదియే యదార్థ
మయిన నే బ్రతుకగలనా? (తొందరగా లేచి యొక మాధవీలతో
కేసి చేతులంజాచి)

(విచారముతో) బాలా! నేతాళజాలనే! అబ్బబ్బ!

(ఆకాశమువంక జూచి)

ఓరి మదనా! నామీద దయలేకపోయినపో! నేలేనితరి నాచెలిని బాధల పెట్టగలవు. జాగ్రత! (వినుట నభినయించి) నామాట విననందువా?

శా॥ ఏరామారుడతల్లి వంకయని నీకెంతేనియున్ లేదుగా
రారావుల్లనుఁ జేయనాయమగునా రాజత్కృపాశాలియా
శ్రీరామా హృదయేశుడానునన కేరీతిన్ దగన్ బుట్టితో
శ్రీరాంబోనిధికిన్ హాలాహలము మాడ్కిన్ పాంథవిధ్వంసకా॥

ఓరీ దురాత్మా!

చ॥ బలిమి వియోగవర్గముల బాధలఁబెట్టెడు నిర్దయాత్మ నీ
దళములు చెట్లపాలయి శతాంగమరూపకమై శిలీముఖం
బులు కడువాఁడి హేయమయి పూనిన యిక్షుశరాసనంబుని
ష్ఫలమయి పోయినంగద శుభంబగు ధారుణికెల్ల మన్మథా॥

నీతోనేలరా!

బాల—(తనలో) అబ్బ! ఇతడామెకంటె నెక్కుడు కృశించుచున్నాడు!

చంద్రు—సీ॥ పాదలుపైమెదలు తుమ్మెదలార మీధాక
చెలికటాక్షు మొకింత కలుగుదాక
గములుగాదెములు కీరములార మీజోక
వారిమధ్యచేరి మాట్లాడు దాక

పగలచేపొగలు సంపెగలార మీకాక
మృగనేత్రి యంగీకరించుదాక
సిరులచేవరలు తామరలార మీకిక
శుకవాణి మెుగమెత్తి చూచుదాక
నవము నవముగ మెరయుపల్లవములార
ప్రబలుమీరేఖకాంతచే పట్టుదాక
తగదు చలమిక దైవమేదారికైన
తలపులీడేర్చగానేర్చు దరుణిగూర్చు॥

(తెరలో తుమ్మెదల ధ్వని)

చంద్రు—(మూర్ఛబోవును)

బాల—(ప్రవేశించి) ఆహా! ఏమి వీరి పరస్పరానురాగము. వీరే న్యాయమయిన దంపతులయినచో యెట్లుండునో? ఇట్టిదంపతుల నొనగూర్చి చేసిన వివాహములే వివాహములు. వీనిం తారకడకు జేర్చెదగాక! (అని యోగబలిమిచే చంద్రునితో యాకాశ మార్గమున నిష్క్రమించుచున్నది.)





# సుజ్ఞానోదయము

## పంచమాంకము.

—o—

### 1. రంగము. ప్రతిష్ఠానపురము.

(తార, చంద్రుడు, యొండొరుల కౌగలించుకొని ప్రవేశము.)

తార— మనోహరా! నేటికి మనకోర్కెలు పూర్తిగా తీర్చుకొనుట కవకాశము కలిగినది. నీవంటినవ యౌవనసుందరాంగుని పెండ్లియాడినవనితయే (ముద్దుబెట్టుకొని) కడుభాగ్యశాలి. నిన్ను చేపట్టుటచేతనే గదా నాసర్వస్వము గోలుపోయిన సరే యని నీతో నిట కేతెంచితిని. గురుండీ సరికి లేచి, పాన్పుపైననున్నాగానక వెదుకు చుండును కాబోలు.

(తెరలో కుక్కుటము కూయును)

చంద్రు— సఖి! ఆతని గొడవతో మనకేమి గాని- నీవు వచ్చు వరకును యాపడకటింటి కడమల్లె పందిలి వద్ద నేను నిమిష మొకయుగముగా గడిపితిని. బాలయోగిని నన్నక్కడ విడిచి నప్పుడు, నీవుత్వర

లోనే వచ్చెదవని చెప్పెను. ఆమెనన్ను మూర్ఛనుండితేర్చి, విశ్రాంతి శ్రమ తీసుకొనెను. మూర్ఛనుండి తేరుటతోనే యామె సౌందర్యము జూచి, నీవేయామె వంటి సన్యాసిని వేషమువేసికొని వచ్చితి వనుకొని, యామెను కౌగ— (సిగ్గుపడుచున్నాడు.)

తార— ప్రియా! చెప్పుము. ప్రమాదమునకు తప్పేమి?

చంద్రు—కౌగలించుకొన బోయితిని. ఆమెపరుగెత్త సాగెను. ఆమెనువెంటాడించి, తుదకు యామెవలననే, నీవే యామెనుపంపితివని విని,నమ్మజాలక,తుదకునమ్మివచ్చితిని. నీవుయాలస్యముచేసిరాకుండ యుండినప్పుడు,యోగినినన్ను భ్రమపెట్టెనని యూహించి వెడలిపోవ ప్రయత్నించుచుండగా నీవునువచ్చితివి.

తార—పనులన్నియు త్వరలోనే చక్కబెట్టుకొని భర్తను నమ్మించి, వచ్చుసరికావేళ యైనది. యోగినిచేసిన యుపకారమునకు కృతజ్ఞతా వందనములనయిన చెప్ప తిన్నగా పలుకలుగలేదు. అప్పటికిని-శిష్య బృందమును త్వరలోనే పంపివేసి, చరచర వంటచేసి, మధ్యన్నీపాటికి వచ్చియుండువని యనుకొనుచు, ముగించివచ్చితిని. ఈ యపచారము సహించవేడెదను.

చంద్రు—ఇంతమాత్రమునకు నన్ను వేడుకొనవలయునా? చాడు. ఆమల్లె పందిలివద్ద

చ॥ అనుగతహారవత్ప్రచుర మాపరిచుంబిత దంతవాస మ
త్యనుపమ మోహజాత పులకాంకుర మర్థనిమీలితేక్షణం

బనవరతస్ఫురన్మణిత మత్యనురాగ నిరస్తనీవి బం
ధనమగుచుఁ జెలంగెఁగడు తద్రతిసౌఖ్య రసాతిభూతిదైఁ॥

కాని యీసాహసకార్య మూరకపోనేరదు.

తార— ఏమగును?

చంద్రు—నీ భర్తపోయి మహేంద్రునితో—

తార— నాభర్త నాకౌగిటనేయుండ నెట్లేగును?

చంద్రు—గురుండని నాయభిప్రాయము.

తార—ఊఁ! గురుండు—?

చంద్రు— మహేంద్రునితోఁజెప్పి నాపైదాడి వెడలునట్లు చేయునని యెంచెదను.

తార—దాడివెడలిన మీరేనా పరాక్రమము లేనివారు! అదిగాక నా యిష్టమయి నే వచ్చిన యీ తప్పునకు దాడివెడలుట యంటర్ధమేమి యున్నది. దాడివెడలి మిమ్మునోడించి నన్నుతీసుకొనిపోయి, నా యీపాడుశరీరమును బాధలపెట్టిన పెట్టగలడుగాని — ఆ యింద్రుడు నా మనస్సును స్వాధీనముచేసికొని, బృహస్పతిపై నా కనురాగము గూడ గలిగించ గలుగునా?

చంద్రు—ప్రియసఖి!ఏమినీవెర్రి! చంద్రుడు తనముద్దులగుమ్మ నితరులకు వదలి బాధలుపెట్టమని చూచుచునూరకుండు వాడనియే భయపడు చుంటివా? ఇంద్రుడు రాని గిందుడురానీ!నామేనప్రాణములుండు నంతవరకు నీపై పోతుటీగనైన వ్రాలనిత్తునా?

తార——తమపరాక్రమము నే నెరుగనిదిగాదు (చంద్రునికురులనుసరిచేయును) అయినను పదిమందిలో సబబు, న్యాయము, యనిగాదూ, యేడ్చెదరు!

చంద్రు——సబబుల కేమిలే? ఒకనిభార్యను మరియొకడు పొందుట యన్యాయమైనచో, యట్టిభార్యనుమరల స్వీకరించుట యవమానముకాదా?

తార——ఈ చర్చతో మనకేల? యుద్యానవనమునకు బోవుదమా?

చంద్రు——మంచిది! చక్కగాజ్ఞాపకము జేసితివి. (ఇద్దరునిష్క్రమించెదరు.)



## 2. రంగము. అమరావతినగరము.



(ఇంద్రుడు. బృహస్పతి ప్రవేశము.)

ఇంద్రు——గురువర్యా! తమరుశలవిచ్చినది నిక్కమే. చంద్రుడుకింతకృత్యమును జేసెను.

బృహ——దీనికికారణము నామంచితనముగాని వేరొండుగాదు.

ఇంద్రు——మొదటయింటనుండి పోయినవాడు తిరిగియెట్లువచ్చెను?

బృహ——అది నాకేమి తెలియును?

ఇంద్రు——ఇతడుప్రస్తుత మేమి సమాధానము చెప్పునో?

బృహ—దొంగతనము చేసినవాడు, చేసితినని యొప్పుకొనునా? ఇందు తా నేమియు నెరుగననియు, మద్భార్యయే దీనికంతకు ప్రోత్సాహకర్త యనియు, లేనిపోని కూతలుకూయుటకు మొదలు పెట్టును.

ఇంద్రు—ఇప్పుడు మనమీమూర్ఖుని శిక్షించుటయెట్లు? యనునంశముమిక్కిలి విచారణీయము. అయినను మనమీ విషయమై, మంత్రివర్గముతో యాలోచించుట యుత్తమము. ఆలోచనకేమున్నది? ఒకసారి యీతనికి ప్రాయశ్చిత్తము చేయవలసినదే!

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు)



## 3. రంగము. ప్రతిష్ఠానపుర ప్రాంతమునందలి బయలు.

---

(ఇంద్రుడుప్రవేశము.)

ఇంద్రు—(తనలో) రాజనీతికి వ్యతిరేకమనియెంచి ముందు పండోపాయమును కడిగకుండ, దూతనుపంపగా, కానిపనిచేసినదేగాక, యందరిని దూలనాడ మొదలుబెట్టెనట? ప్రస్తుతమువీనితో యుద్ధముతప్పనట్లు తోచుచున్నది. ఈయదనుజూచి శుక్రాచార్యుడును, మాపైకి కలహామునకు, దనుజులనుకూడ, చంద్రునకుసహాయముపంపి, తనసహజవైరమును, వెలిబుచ్చనున్నాడని కర్ణాకర్ణిగ దెలిసినది. కానున్నది కాకమానదు. త్రిలోకనాధుడనగు నాకీభయమేల? జారత్వముదోషము. అందు గురుద్రోహముఘోరము. ఘోరమననేల? మిక్కిలిఘోరము. ఇట్టివీనిని శిక్షింపకున్న నాత్రిలోకాధిపత్యమెందుకు?

నంగీకరింతురా! పరిజనమెవ్వరును లేకయొక్కరేయుండి, యేమేమొ భీరములు పలుకుచుంటిరి. మీతోడిదొంగలేరి?

ఇంద్రు— ఏమిరా! గురుద్రోహి! మేమన్న నీకంత వేళకోళముగ నున్నది. ఇంతటి ఘనకార్యము చేసితినని యీ గర్వోక్తుల పల్కుచు విజృంభించుచున్నావు.

చంద్రు— ఇందు వేళకోళ మేమియున్నది. ఉన్నమాట యన్న యలుకెక్కడన్నట్లు నాపై యాగ్రహము వచ్చుచున్నట్లున్నది. అయినను నేను విజృంభించక భయపడవలసిన కారణ మేమి యున్నది? నీవలెను తక్కిన దేవతలవలెను దొంగతనముగా జారత్వము చేయమందువా యేమి.

ఇంద్రు— నీవుచెప్ప దేవత లెవరును నీవలె గురుద్రోహము చేయ లేదురా.

చంద్రు— దురాత్మా! నీతి విదూరులగుటకు గురుభార్యయైన నేమి? పరభార్యయయిన నేమి?

ఇంద్రు— మూఢుడా! ఇన్ని నీతులు తెలిసిన వాడవీ దుర్మార్గ మెట్లుచేయ గలిగితివిరా?

చంద్రు— త్రిలోకాధినాథులును, నా సహపాఠులును యగు తమకే తప్పని యప్పుడీ రక్షనాకు మాత్రమేల తప్పును?

ఇంద్రు— నీవలె హద్దుమీరి దుర్మార్గము చేసినవా రింతవర కెవ్వరును లేరులే!

చంద్రు— నీవలె దొంగతనముగా కోడివై కూసి శాపోప హతులైనవార న నేమి?

ఇంద్రు— ఓరీ! నిశాచరా! పేలకురా!

చంద్రు— ఓరీ! సహస్రాక్షి! వదరకురా!

ఇంద్రు— నీవద్ద సామదాన భేదోపాయములన్నియు వ్యర్థమైనవి.

చంద్రు— నీవంటి రాజనీతిజ్ఞుల నేర్పు! ఇంత చేత కాని రాజనీతిపరుడ వయితివని నిన్నునీవు నిందించుకొనుము.

ఇంద్రు— ఓరీ! మూర్ఖా! యెంతజెప్పినను నీనోరుకట్టు జడనుకొనియెదను- యుద్ధమునకు సిద్ధపడితివా?

సీ॥ పొంచియెంతయుఁదోడ బుట్టినదానిల్లు
కంపవెట్టినమహా ఖలుడవీవ
చలపట్టివెసనిశాచర వృత్తిని సదాళి
తేజంబులడఁచు నిందితుఁడవీవ
కలఁగిఘోషింపఁగా గన్న తండ్రినిఁబట్టి
భంగపెట్టినఘోర పాపివీవ
మెఱసి యాపయినున్న మిత్రునివిభవంబుఁ
జూడఁజాలని నికృష్టుండవీవ

తే॥ ఉంచుభువిలోన విరహిణు లాడుకొనఁగ
సిగ్గుదోషకమిన్నంది చెలువుమీఱఁ
దిరుగుచున్నాఁడ విపుడింత తెలివిలేక
తాళు నీపీచమణచెద ధవళకిరణ॥

చంద్రు— ఓరోరి! పాపాత్మ! నాపీచ మణచెదవుగా! ఎవరితప్పులు వా రెరుగజాలరురా! కురివింద తన నలుపును గురించి చెప్పుకొనునా! ఇటు చూడు.

సీ॥ కోడివై మదనుని కోడివై కృతి నహల్యాజారతను గాంచినట్టి దూరు గురువయినయట్టి యాగురుపైచి విశ్వరూపునిగురు చేసి ద్రుంచ-

యఘంబు । యాంబయాదితికి న్యాయంబెరుంగక గర్భఘాతం బొన
ర్చిన పాతకంబు । యజ్ఞహయంబన యజ్ఞతమువిచ్చిలి సగరుఁ
గీడ్పరిచిన తగనివితము।

॥ మరచితోపరుఁ దెగదుడెమదము కతన
సిగ్గుపడలేవునీమేను చిన్నెలన్ని
పరుసములుపల్కెనను గెల్వఁ దరమెనీకు
విడువుమీనోరిక్రొవ్వోరి వృత్రవైరి॥

దు)— నోటిమాటలతో కార్యమేమిరా?

ంద్రుడు— అది తెలిసినవాడవయినచో క్రియారూపమున నీశక్తి నీవరకే
జూపియుందువు,

ంద్రుడు—నీశక్తి యితరులకు దెలియనదికాదు.

ంద్రుడు—నిజమే! నీశక్తి ముందర నాశక్తి యెంత? స్వర్గముపై నీగవాలినపు
డెల్ల నీకేకృష్ణుడో యడ్డుపడినీయింద్రత్వమును తెరపైబొమ్మవలె
నిలువబెట్టెదరు. అసురులదాడికోర్వలేకయమరావతి విడచిపారిపోవు
టకు బాగాయలవాటు పడితివి.

ంద్రుడు—నీవిప్పుడా యసురులతో గూడి నీయీ యసురకృత్యమును సమ
ర్థింప జూచుచున్నావుగాదూ!

ంద్రుడు—దురాత్మా! నీవాగుట కంతులేదనుకొనియెదను. నాశక్తి చవిజూ
చెదవా?

ంద్రు)— మంచిది! ఒకరి శక్తి నొకరు చవిజూడ వలయుననియే గదా
మేమిచ్చటికివచ్చినది.

ంద్రుడు—అట్లయినచో యుద్ధమునకు సిద్ధమైరమ్ము.

(ఇద్దరు నిష్క్రమించెదరు)-

# సుజ్ఞానోదయము

## షష్ఠమాంకము.

### 1 రంగము, ప్రతిష్ఠానగరము.

—:o:—

(చంద్రుని సభామంటపమునందు వృద్ధకంచుకి ప్రవేశము.

కంచు— నిన్నను జరిగిన యుద్ధనందు మా మహారాజుగారు దేవతలను గెవలలను యొక్క పెట్టున నురుమాడి రెండవనృశింహావతారమువలె చండమార్తాండుని పగిది యుద్ధరంగమున విచ్చలవిడిగ, విజృంభించినాడు. అప్పుడాయన యాకారమెంత భయంకరముగానున్నది. అప్పుడు బ్రహ్మదేవుడుగారు దయచేసి, తనయంశవలన జన్మించిన చంద్రుని శాంత పరచి, వీపుతట్టుచు, తనకుమారుని ప్రజ్ఞకు సంతసింపదొడగెను. నేటిదిన మాయన యేదో తగువు పరిష్కరించుటకు సభజేయునట. అయ్యో! మరచితిని. నేను సభామంటపమును సిద్ధపరుపవలెనే? సుధాకర మహారాజుగారు "యింద్రాదిదేవతలకును, బ్రహ్మదేవుడు మొదలగు వారికిని యుచితాసనములను బాగుగ నేర్పరుపపూర్వకాలపు వాడవయిననీవేసరి" యనిగదా శలవిచ్చియుంటిరి! ముదిమివలన జ్ఞాపకశక్తి బొత్తుగా పోయినది. (అనియాసనాదికములనుసరిచేయున్నాడు.)

రాజభటుడు— (ప్రవేశించి యథాపూర్వముగా పరుగు లెత్తుట నభినయించి) సుధాకరమహారాజుగారు సభాస్థానమునకు వచ్చుచున్నారు. ఆసనములన్నియు సిద్ధము చేసితివా?

కంచు— ఆహా! (నిష్క్రిమణ)



## 2 రంగము.

———:0:———

(చంద్రుడు, బ్రహ్మ, బృహస్పతి; ఇంద్రుడు సపరివారముగా ప్రవేశము.)

చంద్రు— దేవదేవోత్తములారా! ఈయాయాసనముల నాసీనులుకండు (అని యాసనములు చూపు చున్నాడు. అందరుకూర్చుండుట.)

బ్రహ్మ— దేవగురూ! దేవేంద్ర! నిన్నమీయుద్ధము నాపుజేయుసరికి మాతాతలు దిగి వచ్చిరిగద! నేడు నేచెప్పువిషయముల బాగుగనాలకించెదరుగాక!

దేవేం— చిత్తము.

బృహ— తమయిష్టమునకు వ్యతిరేకము చేయువారెవరు?

బ్రహ్మ— (బృహస్పతినుద్దేసించి) దేవగురూ! నీవు శాస్త్రజ్ఞానమూర్తివి. శాస్త్రజ్ఞానమును నేను నిన్నుగా సృజించితిని. నీధర్మములు, నీశాంతమును వర్ణనాతీతములు. నీకు మేలగుగాక!

బృహ— చిత్తము

బృహ—(చంద్రునుద్దేసించి) కుమారా! నీవు "అనుభవజ్ఞానమవ్వుసుమా! అనుభవమే సిద్ధాంతమని నీవుచేసిన పనిమంచిది కావచ్చును గాని, యనుభవమునందు కూడ చిరకాల సంగ్రహానుభవము గణన చేయవలసియున్నది. చిరకాలానుభవసంగ్రహమే శాస్త్రసంగ్రహము. శాస్త్రగ్రాహకుడే శాస్త్రజ్ఞుడు! అట్టిశాస్త్రజ్ఞానమూర్తియగు బృహస్పతి యనుభవశాస్త్రచింతన, నీయనుభవముకన్న నెక్కుడుసుమా! నీయనుభవమునకు కారణమయిన, కారకుడయిన, శాస్త్రములను, శాస్త్రజ్ఞుడగు బృహస్పతిని పాటించక, మనసునకిష్టమైనట్లు సంచరించితివి. నీదిమిక్కిలి యపాయకృత్యము. గావున నిట్టిపనులు చేయుట కీర్తికాముకుల ధర్మవ్యతిరేకము.

చంద్రు—చిత్తము."

బృహ—(తారనుద్దేసించి) "అంగనా! నీవు మనస్సుయొక్క యవతారముగా నావలన జేయబడితివి. మనస్సునకు మర్కటచేష్ట లెక్కుడనుజెప్పెడి నుడువులు యథార్థముగా తోచుచున్నవి. అనుభవజ్ఞానమును నీవుపొందుటకు జేసినయీప్రయత్నము మిక్కిలి శ్లాఘనీయము. ఈ ప్రయత్నమునకు ఫలితముగా నీవుజ్ఞానమును బడయగలవు. అది సుజ్ఞానమే. ఆసుజ్ఞానము నీకుద్భవించుటయే సుజ్ఞానోదయము "అదియే బుధజననము" గాని యీయనుభవజ్ఞానము (చంద్రుని) కన్న వేయిమడుంగులధికయనుభవమువలనయార్జింపబడినజ్ఞానపుంజమే "శాస్త్రము" ఆశాస్త్రజ్ఞానమును పూర్తిగాబొందినవాడును, నీపరమావధియు, పవిత్రమూర్తియు నగుబృహస్పతి పూజనీయుడు. ఆతనినివిడిచి చంద్రుని పొందుట పొరబాటు. నీపొరపాటునుసవరించుకొని, నీభర్తంజేరి, సుఖముననుండుము. సుధాకరుండమృత ధరుండగుటచేతను, వాయ

నుగ్రహమ్మునను, భర్తృశాంతమునను, నీవుపవిత్రురాలవైతివి. ఆతనివలన గలిగెడు బుధుడనునీకుమారుడు శాశ్వతకీర్తిని బొందునుగాక!

తార—(సంతోషముతో) చిత్తము. (భర్తనుజేరును)

బ్రహ్మ—దేవేంద్రా! నీవెరుగనిధర్మములెవ్వియునులేవు. నీవుబహుసమర్థుండవు. జితేంద్రియతయేనీవు. నీధర్మమును నీవుజేసితివి. చంద్రునకు నీకును వైరకారణముతీరినది. ఆతడుముందురాజసూయమును చేయగలడందున నీ పతనికి సహాయపడునది.

ఇంద్రు—చిత్తము.

బ్రహ్మ—సుధాకర! నీవేమికోరెదవు?

చంద్రు—

ద్వి॥ పుడమిసస్యాఢ్యయై । బొదలునుగాత
యెలమిభాషాభామ । కింపులనింపు
తెలుగుకవు లందరు । స్థిరమైననగల
శరపరంపరలుగా । జేతురుగాక!॥

బ్రహ్మ—తథాస్తు.

(అందరు నిష్క్రమణ.)



## కీర్తనలు

(1) 39 వ పేజ 2 న పంక్తి తరువాత

(చంద్రుడు, తార సంవాదన)

శ్యామ—ఏక. (చలాహైశుక)

చం— చెలీయా । తుచ్ఛసుఖంబులకై । యిలాపైచెడ్డపేరుగనెదో ॥చెలి॥
(అను పల్లవి)

తార— సఖా నా । మనసునందు నీపై మరులుగొని।నినుగోరితి వినుమా
॥సఖా॥ (అను పల్లవి.)

చం— (1) చుట్టపక్కములనైనా జూడుము ।
చూడు మగనినైనన్ ।
చెడిపోయెదవు । చెడగొట్టెదవు ।
చెడ్డచింత విడుమా॥చె॥

తార— చుట్టపక్కములకై నేచూడను ।
చూడను పతి కులము ।
చెడిపోయినసరె । చెడగొట్టుటయెటు ।
చింత చెడ్డనగునా॥స॥

చం— (2) బంధుజాల మడకొత్తుననొక్కను ।
భర్త జంపజూచు ।
సతితప్పనకై । పతికపయశమా ।
బ్రతిమాలెదవినుమా ॥చె॥

తార— ఇయన్నియు నే మున్నె యెరుంగుదు ।
ఏలజెప్పెదవు నాకు ।

పరోపకారః । పుణ్యాయనియడి ।
పెద్దల నుడి వినవో॥సఖా॥

చం— (3) ఇహపరంబులకు వెలియగునీపని ।
నెందుకుబూనవలెన్ ।
శ్రీహరివేడుము । గురుమది నెంచుము ।
చిరకీర్తినిగనుమా॥చె॥

తార— కోరివేడితిని నామనోహరా ।
కోపగించుకోనకు ।
గోనబామేనిదె । కానుకనిచ్చెద ।
గోముమీ వేవేగ॥స॥

స్త్రీం— (4) మగనిగాక మరియొకనిగూడుటలు ।
మగువలకిది తగునా ।
ముదుసలియైనను మూర్ఖుడైనను ।
మగడె దైవమిదివినుమా॥చె॥

తార— (జౌనా) మగడనంగమది మక్కువతగిలిన ।
యతడే మగడుసుమా ।
యతనిగూడిమరి । యొక్కనిగూడిన ।
యఘమది యగునుసుమా॥స॥

చం— గురుసతివీవే యిట్లొనర్చినను ।
కవులయమున నింకెవతె ।
మగనితోత్తగ కాపురము చేయును ।
మనవినుము । వినుము । నా । మనవి॥చె॥

తార— వేయిజెప్పినను నూరుజెప్పినను
వినుదానను నేగాను
(యింత) విరసమేల । నీకై నేజత్తును ।
మనవి । వినుము । గోనుము॥సఖా॥

(2) 40 వ పేజి 10 వ పంక్తి తరువాత

( చంద్రుడు, తార యొకరితరువాత నొకరుగాని, కలిసిగాని, పాడవచ్చును.

అన్నులమిన్నయీ । యన్నిచిత్రములు । కన్నులార గనుమా।

అనుపల్లవి

సన్నజాజి । సురపొన్నగన్నేరు। క్రొన్ననవిరితేనె । చిన్నిమామిడపము లాను ॥అన్నులమిన్న॥

2. జిలిబిలియలరూల । జిమ్మెలతాంతము ।
సొలపూనామీరెనా । శోకలతాంతము ॥ అన్నుల॥

3. భుగభుగామని । సురపొన్నాలువిచ్చెను ।
మగనీకిచెలికమ్మని । మోవియిచ్చెను ॥ అన్నుల॥

4. మసలాకపికములు । మౌనముదీరెను ।
కనుగొనవె । శృంగారవనములు ॥ అన్నుల॥

(3) 48 వ పేజి 18 వ పంక్తి తరువాత

(బృహస్పతి)

ఫీల్——ఆది,

పాపి! ఛండాల! శాపమునీకిదె ।
రూపుమాయునురా । ఆతె॥పా॥



(1) గురుభార్యనెంచని । ధర్మముపాటించని । పాపముతలంచని । స్వామి
గౌరవముంచని । ఎంచని ॥పా॥

(2) నీచుండవై నిశాచరుండవై । కళంక కలితుండవై । కీర్తివిదూరు
డవై । కష్టసుఖములబడు ॥పా॥

(3) పర్వదినములలో । పామునోటబడు । పాండునర్గముతోడ ।
బాధలుపడుమా ॥పా॥

(4) 55 వ పేజి 5 వ పంక్తి తరువాత

(చంద్రుడు)

దానికేనయైన చాన । జగాన । గాన॥

1 తళుకుబంగారుకుండ । తావిసంపంగిదండ ।
కలికిన్ కన్నులనిండ । ఊంయి, ఊంయి, గానక నేనుండ ॥దాని॥

పచ్చికస్తురివీణ । భాగైన నెరజాణ ।
నవమన్మధునిబాణ । ఊంయి, ఊంయి, జ్ఞానానప్రవీణా ॥దాని॥

3 మకరందములవాక । మదనాశాస్త్రపుటీక ।
మన్మాధునిడాక । ఊంయి, ఊంయి, అందాములపోక ॥దాని॥

4 మురిపెంబులకుతీవి । మరుదోటయులమావి ।
సరసూలనడబావి । ఊంయి, ఊంయి, శృంగారములతీవి ॥దాని॥

(5) 55 వ పేజి 10 వ పంక్తి తరువాత

(చంద్రుడు)

తోడి—ఆది.

దాని గూడి యుండువాని । సుఖమనగా మంచిసుఖము ॥దా॥

1 వింతాజాజి పూబంతి । కాంతలకునెల్ల మేల్బంతి । కలువదంతి । ఆపొలంతి ॥దా॥

2 మేటిరతుల సురతాణి । వాటమామించుబోణి । జవాజిభరణి । విపులసరణి ॥దా॥

3 సుధలబావిగిలుక । రతిచేతిరామచిలుక । మర్వంపుమొలక । నవ్వులకునిలక ॥దా॥

4 మాంచిముచ్చటలకిమ్ము । మించూబోణియురమ్ము । సుఖకరమ్ము । మంచిసొమ్ము ॥దా॥

(6) 58 వ పేజి 1 వ పంక్తి తరువాత

(చందురుడు)



జాలమిక నేల । నే!। తాళజాలబాల ।
జిలిబిలి గాడ్పుల । చేతాళజాలనీ ।
ఘననాభిగుహ చెంత । కడియనీవే॥జా॥
మోహాంబురాశిలో । మునిగెదనిపుడనీ
పృధునితంబద్వీప । మెనయనీవె॥ జా॥
యామిని బలుతాప । మానంగలేనునీ ।
యధరసుధాధార । నానవీవే॥జా॥
చిగురాకు కార్చిచ్చు । సెగలెయించెనీ ।
నెరుల మబ్బుల చాయ । నిలువనీవే॥జా॥

# తప్పొప్పుల పట్టిక

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 1 | జ్ఞానషయ | జ్ఞానవిషయ |
| 7 | 4 | చెప్పుచు. | చెప్పుచుండగా |
| 9 | 15 | నించగక్ | నించెదుక్ |
| 11 | 7 | బాగా | బాగుగ |
| 14 | 15 | కింకర | యమకింకర |
| 15 | 3 | చేవితయ్యా | చేసితివయ్యా |
| 15 | 22 | బ్రహ్మార్ప | బ్రహ్మార్ప |
| 15 | 23 | ఉలికి | (ఉలికి |
| 21 | 11 | సునాసీను | యూసీను |
| 21 | 18 | గురూజి | గురువర్యా |
| 31 | 1 | లేఖ | రేఖ |
| 31 | 13 | స్వడుయామె | స్వాడామె |
| 32 | 11 | వేచుచున్న | వేచియున్న |
| 41 | 13 | కరభాగ | తరంభగ |
| 47 | 20 | తలనం | తలవం |
| 48 | 15 | బృహ | బృహ |
| 60 | 14 | గడిపి | గడపి |
| 64 | 18 | నే?ల | నేల? |

**N. B.** ఈప్రకారముముందుసవరించుకొని, తరువాతచదువుకొనుట మంచిది. సాధ్యమయినంతవరకు దిద్దినాము. ఇంకనుతప్పున్నయెడల చదువరులు క్షమింతురుగాక!